


రెక్క చాచుకుంది అది ఏమంది? రివ్వున ఎగిరే నిజమైన శక్తియేనండీ

**పార్లే-జి**

పరిపూర్ణమైన రుచి పరిపూర్ణమైన శక్తి.

భారతదేశంలో అత్యధికంగా అమ్ముడవుతున్న బిస్కట్లు.

everest/93/PP/17

…నూతన సంవత్సర శుభాకాంక్షలు!

బి.నాగిరెడ్డి
సమర్పించు



విజయా వారి

# తెలుగు సినిమా ప్రేక్షకులకు
## వినతి

షావుకారు, పాతాళభైరవి, మాయాబజార్, గుండమ్మ కథ, మిస్సమ్మ, పెళ్లి చేసి చూడు, జగదేకవీరుని కథ మొదలైన ఎన్నో శతదినోత్సవ చిత్రాలను విజయా సంస్థ మీకు అందించింది. వాటిని మీరు ఆదరించారు, అభిమానించారు. ఈ సంస్థ ఉత్తమ చిత్రాలను నిర్మించే సంస్థ కావడానికి కారకులయ్యారు. నా ప్రాణానికి ప్రాణం అయిన చక్రపాణి గారి అస్తమయంవల్ల చిత్రాలు నిర్మించలేక 18 సంవత్సరాలు తెలుగు సినిమా ప్రేక్షకులకు దూరం అయ్యాను. మళ్లీ ఈనాటికి మీ ముందుకు వచ్చే అవకాశం కలిగింది.

కొత్తవాళ్లతో, కొత్త తరహాలో సూపర్‌స్టార్ రజనీకాంత్ గారు తమిళంలో తీసిన "వళ్లి" చిత్రాన్ని అనుకోకుండా చూడ్డం జరిగింది. ఆ కథ నాకు నచ్చింది. అది మా విజయా సంస్థ స్థాయికి తగిన చిత్రం అనిపించింది. నాకు నచ్చిన చిత్రాన్ని మా అభిమానులందరికీ చూపించాలనే ఆకాంక్ష కలిగింది. అందుకే ఆ చిత్రాన్ని తెలుగులో "విజయ" పేరుతో అనువదించాలనుకున్నాను.

"విజయ" ప్రతి ఒక్కరూ సకుటుంబంగా చూడదగిన చిత్రం. ఒక మంచి పిల్ల, సంప్రదాయమైన కుటుంబంలో పుట్టి పెరిగిన పిల్ల, చదువుకున్న పిల్ల, విధి వక్రించి వయసనే శాపానికి గురై తప్పటడుగు వేసినా, ధైర్యంగా నిలబడి తన అభీష్టాన్ని ఎలా సాధించుకుందో ఈ చిత్రం చూస్తే మీకే తెలుస్తుంది. "విజయ" ఈనాటి యువతరానికి ఒక ఉదాహరణ. 'నువ్వు ప్రేమించేవాళ్లని చేసుకోవడం కంటే, నిన్ను ప్రేమించేవాళ్లని చేసుకుంటే జీవితంలో సుఖపడతావు' అన్న మాటల్లో ఎంత సత్యం వుందో ఈ చిత్రం చూస్తే మీరే గ్రహిస్తారు.

చదువు, నాగరికత, స్వేచ్ఛ కావాలని కోరుకునే ఆడపిల్ల, కన్నవాళ్ల కోరికనీ, కోరుకున్నవాడి ఆశనీ మన్నించి జీవితాన్ని ఎలా మలుచుకుందో ఈ "విజయ" చూస్తే మీకే తెలుస్తుంది.

లోగడ మా సంస్థ నుంచి వచ్చిన చిత్రాలలాగే ఈ "విజయ" చిత్రాన్ని మీరందరూ చూసి అభిమానించి ఆదరిస్తే నా ఆశయం నెరవేరిందనే సంతృప్తి నాకు మిగులుతుంది.

మీ అభిమానాన్ని కోరే
B. Nagi Reddi
బి.నాగిరెడ్డి

# విజయ

సినిమా స్కోప్-కలర్

కథ-స్క్రీన్ ప్లే: రజనీకాంత్ సంగీతం: ఇళయరాజా దర్శకత్వం: కె. నటరాజ్







UNIT TRUST OF INDIA

సంప్రదాయం, ఆధునికత కలిసి కాపురం చెయ్యగలవా?
-డా॥ మాలతీ చందూర్ ఏమంటున్నారు?

మొన్న....నిన్న.... ఈ రోజు..మన సంప్రదాయాల సరళి పై మూడు తరాలకు చెందిన వనితల మనోభావాలు ఎలావున్నాయి?

మన ఆచారాలు, సంప్రదాయాలు నేటి సమాజానికి ఎంతవరకు అవసరం?
-రెండు తరాలకు చెందిన పాఠకులేమంటున్నారు?

విదేశీ వ్యామోహంతో, ఎలక్ట్రానిక్ మీడియా ఆక్రమణతో ఏమవుతోంది మన సంప్రదాయం?

వీటి సమాధానాలకి



**సంప్రదాయాల విశేష సంచిక**గా వెలువడిన

సంక్రాంతి (జనవరి'94) సంచిక

# వనిత

**చదవండి! చదివించండి!!**

ఈ సంచికలో ఇంకా.....

ప్రముఖ రచయిత్రులు - అడివి సూర్యకుమారి, జలంధరల సశేష నవలలు, ముచ్చటగా మూడు కథలు, ప్రముఖ దంపతులు (శారద - శ్రీనివాసన్), అరవై ఏళ్ల క్రితం వంటలు, చిట్కా వైద్యం, బామ్మగారితో ముఖాముఖి, డాబా గార్డెన్ పెంచడం ఎలా? వనిత మాటల కొలువు, కదంబమాల - ఇలా మిమ్మల్ని ఆకట్టుకునే పలు శీర్షికలతో, ఆకర్షణీయమైన గెటప్‌తో, 32 పేజీల వర్ణ చిత్రాలతో వెలువడింది.

విడిప్రతి : రూ. 6/- **వనిత** సం॥ చందా: రూ. 72/-

## ఇక ప్రతి సంచికా ఒక ప్రత్యేక సంచికే!

చందాలు పంపవలసిన చిరునామా:
డాల్టన్ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026.




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## నూతన సంవత్సరం!

మళ్ళీ నూతన సంవత్సరం ప్రారంభమయింది. గత సంవత్సరానికి నిన్న కాక మొన్న స్వాగతం పలికినట్టు ఉంటుంది. అందుకే— కాలం ఎంతో వేగంగా నడుస్తుంది! అంటూ ఉంటాం.

నిజమే. భూతకాలాన్నీ, భవిష్యత్తునూ తనలో ఇముడ్చుకుని ఉరకలు వేస్తూ పరుగులు తీస్తుంది కాలప్రవాహం. అయితే, నదీ ప్రవాహంలాగా దీనికి ఆరంభం, అంతం అంటూ ఉండదు. నిరంతరం ముందుకు సాగుతూనే ఉంటుంది. కాలం ఎవరికోసమూ ఆగదు. ఈ సత్యాన్ని గుర్తించి, కాలం విలువను గ్రహించినవాళ్ళే, జీవితంలో ఏదైనా సాధించగలుగుతారు; మంచి మార్పు కోసం కృషి చేసి, మానవజాతి అభ్యున్నతికి అనుకూలంగా కాలచక్రాన్ని తిప్పినవారవుతారు.

కాలంతోపాటు ప్రజల జీవితాలలోనూ ఎన్నో మార్పులు వస్తూ ఉంటాయి. వాటిని మంచి మార్పులుగా మలుచుకోవడం అన్నది మనిషి తెలివితేటలను బట్టి ఉంటుంది. ఈ మార్పు కోసం ఏడాది వరకు ఆగనవసరం లేదు. ఆ మాటకు వస్తే మంచి మార్పును తెచ్చే ప్రతిరోజూ, నూతన సంవత్సరమే. నిన్నటి మన చేతలను బట్టి, ఈరోజు మన పరిస్థితి ఉంటుంది. ఈరోజు మనం చేసే పనుల మీదే రేపటి జీవితం ఆధారపడి ఉంటుంది. కాబట్టి, నిన్నటికన్నా ఈరోజు అభ్యుదయ పథంలో ఒక్క అడుగయినా ముందుకు వేద్దాం. అదే రేపటి వసంతానికి స్వాగతం పలికి నట్టవుతుంది!

సంపుటి: 93 జనవరి'94 సంచిక: 1

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00







# I shared my homework. And some maths. Did some patterns. Shared my Mortons.





## MORTON SWEETS

We enjoy our School days.....and Lunch Breaks more so with Mortons which we share. It has been our Family's favourite for years and years. Delicious and yummy in so many flavours. All with the goodness of Creamy Milk, Glucose and Sugar. Chocolate and Coconut Cookies, Rose Eclairs, Supreme Chocolate and Coconut Toffees, Lacto Bonbons, Mango King and so many other delicious treats. Um m m m m. Every bite a yummy delight.





*A lifetime of real goodness*

**MORTON CONFECTIONERY & MILK PRODUCTS FACTORY**
P.O. : Marhowrah 841 418. Dist. : Saran, Bihar

Caution Notice: MORTON and its wrappers are registered trade mark of Upper Ganges Sugar & Industries Ltd. Any infringement of trade mark rights is liable to prosecution.

CCM-2/93

# అధ్యక్షుడి వాగ్దానాలు



మన దేశానికి సన్నిహిత మిత్రుడయిన మామూన్ అబ్దుల్ గయూమ్ నవంబర్ 11వ తేదీ మాల్దీవుల అధ్యక్ష పదవిని వరసగా నాలుగవసారి చేపట్టాడు. పార్లమెంటు (స్టేట్ మజ్లిస్) ఆయన పేరును మాత్రమే ప్రతిపాదించడం వల్ల ఎన్నికలంటూ ప్రత్యేకంగా జరగలేదు. ప్రజల అభిప్రాయ సేకరణ మాత్రం జరిగింది. అక్టోబర్ 1వ తేదీ జరిగిన అభిప్రాయ సేకరణలో 93 శాతం మంది పార్లమెంటు ప్రతిపాదనను ఆమోదించారు.

అభిప్రాయ సేకరణకు ముందు అధ్యక్ష పదవికి గయూమ్ పోటీ చేయడనే అందరూ అనుకున్నారు. గయూమ్ మాజీ అంతరంగిక సలహాదారుడూ, బావమరిదీ అయిన ఇలియాస్ ఇబ్రహీం, పార్లమెంటు చేత తన పేరును ప్రతిపాదింపచేయడానికి ప్రయత్నించాడు. అయితే, అతని మీద కొన్ని అభియోగాలు వచ్చి, విచారణలో దోషి అని బయటపడడంతో అతన్ని మాల్దీవుల నుంచి 15 సంవత్సరాలు బహిష్కరించడం జరిగింది. అందువల్ల అధ్యక్ష పదవికి గయూమ్ కన్నా అర్హత గల వ్యక్తి కనిపించలేదు.

ఎన్నికలకు ముందు గయూమ్ ఎన్నో వాగ్దానాలు చేశాడు. దేశానికి నూతన రాజ్యాంగ శాసనం రూపొందించడం, అధికార వికేంద్రీకరణ, ఎన్నికల విధానంలో సంస్కరణలు — అంటే, రాజకీయ పక్షాలను అనుమతించి, అభ్యర్థుల పోటీలను నిర్వహించడం, యువతకు ప్రత్యేక ప్రాధాన్యతనివ్వడం వాటిలో ప్రధానమైనవి. యువతీయువకుల మధ్య పెరిగిపోతూన్న మాదకద్రవ్యాల వ్యసనాన్ని కూడా ఆయన తీవ్రంగా ఖండించాడు. ముఖ్యంగా గత మూడేళ్ళుగా 15-17 మధ్య వయస్సు గల యువతీయువకులలో మాదకద్రవ్యాల వ్యసనం పెరిగినట్లు చెబుతున్నారు. యువతరం మద్యానికీ, మాదక ద్రవ్యాలకూ దూరంగా ఉండాలని గయూమ్ పిలుపునిచ్చాడు. యువజనుల సమస్యలను పరిష్కరించి వారి భవిష్యత్తును చక్కగా తీర్చిదిద్దాలన్న ఉద్దేశంతో గయూమ్, రషీదా యూసుఫ్ అనే వనితకు యువజన, స్త్రీ సంక్షేమ శాఖలను అప్పగించాడు.

ప్రపంచంలోని చాలా చిన్న స్వతంత్ర దేశాలలో మాల్దీవుల రిపబ్లిక్ ఒకటి. దాదాపు 130 చ.కి.మీ. విస్తరించి వున్న 1200 దీవుల సముదాయం ఈ దేశం. 200 దీవులలో మాత్రమే ప్రజలు నివసిస్తున్నారు. ఒక్క దీవి వైశాల్యం కూడా 13 చ.కి.మీ. మించి లేదు.

మాల్దీవుల ప్రాచీన చరిత్ర స్పష్టంగా తెలియదు. క్రీ.పూ. 4వ శతాబ్దంలో దక్షిణ భారతదేశం నుంచి




ద్రావిడ సంతతికి చెందినవాళ్ళు కొందరు మొట్టమొదట అక్కడికి చేరారనీ, ఆ తరవాత ఉత్తర భారత దేశం నుంచి మరికొందరు వెళ్ళి స్థిరపడ్డారనీ చెబుతారు. శ్రీలంక నుంచి కూడా కొందరు వచ్చారు. వాళ్ళతోపాటే బౌద్ధమతం కూడా వచ్చింది. 12వ శతాబ్దంలో రాజు ఇస్లాంమతం పుచ్చుకుని ప్రజలను కూడా ఆ మతాన్నే పుచ్చుకోమని ఆదేశించాడు. ఆ తరవాత దేశంలో అక్కడక్కడా మసీదుల నిర్మాణం జరిగింది.

1887వ సం॥లో బ్రిటీష్ అధికారంలోకి వచ్చిన ఈ దీవులు 1965వ సం॥లో స్వతంత్రం పొందాయి. 1968వ సం॥లో అదొక రిపబ్లిక్ అయింది. ఆ సంవత్సరమే ఇబ్రహీం నజీర్ ఆ దేశానికి అధ్యక్షుడై 1978వ సం॥ వరకు ఆ పదవిలో ఉన్నాడు. ఆయన తరవాత గయూమ్ అధ్యక్ష పదవిని చేపట్టాడు.

## వింత గొలిపే కొన్ని విశేషాలు:

* మాల్‌దీవుల జనాభా మొత్తం ఒక పెద్ద స్టేడియంలో ఇమిడిపోగలదు.
* ఎక్కువమంది ఇంగ్లీష్ మాట్లాడతారు. అరబిక్ పదాలు కలిసిన సింహళం వంటి దివేహి భాష కూడా ముఖ్యమైనదే.
* దేశంలో రాజకీయ పార్టీలు, పోస్టాఫీసులు, ప్రత్యక్ష పన్నులు లేవు.
* సముద్ర తీర కాపలాదళం తప్ప, ప్రత్యేకంగా రక్షణ శాఖ అంటూ లేదు.
* దేశంలో జైలు లేదు. హింసాత్మకమైన నేరాలు కూడా చాలా అరుదు.
* దేశ ఆర్థికస్థితి మత్స్యపరిశ్రమ, పర్యాటకశాఖ మీదే ఆధారపడి ఉన్నది.



# రాజు - నిద్ర

సువర్ణదేశపు రాజుకు నిద్రలో ఒక కల వచ్చింది. ఆ కలలో ఆయనకు నల మహా రాజు కనిపించి, కొత్త రకం వంట చేసి పెట్టాడు. ఆ వంటకం రుచి అద్భుతంగా వుంది. నలమహారాజు అది ఎలా చేశాడో రాజుకు గుర్తుంది. రాజు ఆ వంటకాన్ని తన వంటవాడి చేత చేయించుకోవాలనుకున్నాడు. మర్నాడాయన స్వయంగా వంటశాలకు వెళ్ళాడు.

ఆ సమయానికి వంటవాడు పళ్ళెంలో ఏదో కొత్తరకం వంటకాన్నుంచుకుని, కొద్ది కొద్దిగా తీసుకుని తింటున్నాడు. ఆ సువాసన కలలో వంటిదే అని రాజుకు అనిపించి, అదేమిటని వంటవాణ్ణి అడిగాడు.

వంటవాడు రాజును చూసి తత్తరపడి, "ప్రభూ! ఇది తమరు తినదగ్గ వంటకం కాదు. ఇందులో పులుసూ, కారం నురీ ఎక్కువగా వుంటాయి. ఇది తిన్నవారికి ఒక పట్టాన నిద్రపట్టదు. నాకిది ఎంతో ఇష్టం. తమకు విలువైన పదార్థాలతో వంట చేసి, ఈ చౌక బారు వంటకంతో నేనెంతో తృప్తిపడుతుం టాను," అన్నాడు.

అయితే, రాజు ఊరుకోక వంటవాడు తనకోసం చేసుకున్న ఆ వంటకాన్ని కొంత తనూ తిన్నాడు. అది ఆయనకెంతో నచ్చి, "ఇక మీదట వారానికి రెండు సార్లయినా ఇలాంటిది తయారుచేసి, నా భోజనంతో జత పరుస్తూండు," అని చెప్పి వెళ్ళాడు.

ఆ రాత్రి రాజుకు నిజంగానే నిద్ర పట్ట లేదు. కడుపులో మంటగా అనిపించింది. గొంతులో అదొకరకంగా వున్నది. ఆయన మంచం మీద లేచి కూర్చుని, మహారాణిని నిద్ర లేపి తనకు నిద్ర పట్టడం లేదని చెప్పాడు.

"యువరాజు విలాసాల్లో మునిగి తేలుతు న్నాడని మీరు బెంగ పడకండి. అతడు అన్ని విద్యల్లోనూ ఆరితేరాడు. తన బాధ్యతలన్నీ

శ్రీరామకమల్



"మన ఖర్చులు పెరుగుతున్నాయి. ఆదాయంతరిగిపోతున్నది. అలాగని తమరు బెంగ పెట్టుకుంటే ఎలా? ఈ సమస్య అన్ని దేశాలకూ వస్తుంది. పరిష్కార మార్గం దొరక్క పోదు," అన్నాడు కోశాధికారి.

"కొందరు రాజద్రోహులు పొరుగు రాజు సాయంతో మన దేశాన్ని దెబ్బ తీయాలని చూస్తున్నారని, మీరు నిద్ర పాడుచేసుకోకండి. ఇందుకు ప్రతిగా మనం ఏదో వ్యూహం పన్న లేకపోము," అన్నాడు సైన్యాధిపతి.

"రాజోద్యోగుల్లో అవినీతి పెరిగిపోతున్నది. మనమిచ్చే సదుపాయాలు సక్రమంగా ప్రజలకు చేరడంలేదు. అందువల్ల ప్రజల్లో అసంతృప్తి ప్రబలుతున్నది. తమరు నిద్ర పాడుచేసుకుని ఏం లాభం? మేమంతా ఎందుకున్నట్లు? తొందరలోనే ఏదో ఉపాయం ఆలోచించగలం?" అన్నాడు మంత్రి.

చక్కగా తెలుసుకున్నాడు. ఇది అనుభవించాల్సిన వయసు. అందుకని విలాస జీవితం గడుపుతున్నాడు. ఇది ఎంతో కాలం సాగదు," అన్నది రాణి నిద్రమత్తుతో ఆవలిస్తూ.

యువరాజు విలాస జీవితం గురించి రాజుకు తెలియదు. ఆయన ఆశ్చర్యపడి, ఇంకా విశేషాలడగాలనుకుంటే రాణి గాఢ నిద్రలోపడింది. రాజుకు నిద్ర పట్టక వైద్యుడి కోసం కబురంపాడు. వైద్యుడితోపాటు కోశాధికారి, సైన్యాధిపతి, మంత్రి కూడా వచ్చారు.

వైద్యుడు, రాజును పరీక్షించి నిద్రపట్టక పోవడానికికారణం అంతుపట్టడం లేదన్నాడు. తనుతిన్న వంటకం గురించి చెప్పడానికి రాజు మొహమాట పడ్డాడు.

రాజు వాళ్ళను పంపేశాడు. తనకు నిద్ర పట్టక పోవడానికి ఇవేమీ కారణాలు కావని ఆయనకు తెలుసు. అసలు విషయం తల్లికి తప్ప ఎవరికీ చెప్పుకోలేననిపించి, ఆయన రాజమాత వద్దకు వెళ్ళాడు.

ఆ సమయంలో రాజమాత మెలకువగానే వుండి ఏదో గొణుక్కుంటున్నది. కొడుకును చూడగానే ఆమె, "నీకు నిద్ర పట్టడం లేదు కదూ, నాకు తెలుసు! కొడుకు విలాసాల్లో మునిగి పోయాడు. కోశాగారంలో డబ్బు తరిగి పోయింది. అవతల పొరుగు రాజుల నుంచి

యుద్ధభయం. ఇవతల దేశంలో అవినీతి! ఏ రాజుకు మాత్రం నిద్రపడుతుంది? నీకు సాయపడి ఏదైనా ఉపాయం చెప్పమని నీ తండ్రితో అంటే, ఆయన ఏమీ పట్టించుకోకుండా ఒళ్ళెరగని నిద్రపోతున్నారు. నీ పరిస్థితి తెలుసుకుని నాకు నిద్రపట్టక, నీ తండ్రి ఉపేక్షాభావాన్ని తలుచుకుంటూ ఇలా కూర్చున్నాను," అన్నది.

"అమ్మా! నా నిద్రాభంగానికి కారణం నువ్వనుకుంటున్నవేమీ కాదు. భోజనంలో ఏదో తేడా వచ్చింది," అన్నాడు రాజు.

అందుకు రాజమాత నవ్వి, "చిన్నప్పటి నుంచీ నువ్వింతే! నీ బాధకు కారణం నీకే తెలియదు. రాజరికం చేసే వాడికి సుఖంగా నిద్ర పట్టిందంటే — ఆ దేశంలో సమస్యలన్నవి లేవని అర్థం. సమస్యలున్నా సుఖంగా నిద్రపోయే రాజు, ఏ దేశానికైనా అరిష్టం. నీ వయసులో నీ తండ్రి నీకులాగానే నిద్రపోకుండా శ్రమించారు. ఇప్పుడు నీ మీద నమ్మకంతో సుఖంగా నిద్రపోతున్నారు. నీ సమస్యల గురించి తల్చుకుంటూంటే, నాకే నిద్ర పట్టడంలేదు. నీకేం నిద్రపడుతుంది? నీ సమస్యలకు పరిష్కారం ఆలోచించు. ఆ తర్వాతే నీకు నిద్ర పడుతుంది," అన్నది.

రాజు మారుమాట్లాడకుండా తల్లి పాదాలకు నమస్కరించి వెనుదిరిగాడు. అంతకాలం ఆయన కటుంబ సమస్యలను రాణిచూసుకుంటుందనీ, రాజరికపు బాధ్యతలను కోశాధికారి, సైన్యాధిపతి, మంత్రి చూసుకుంటారనీ నమ్మి నిశ్చింతగా వుంటున్నాడు. కానీ వాళ్ళంతా ఆ సమస్యల గురించి తను ఆలోచిస్తున్నాడని భావిస్తున్నారు.

ఎన్నో సమస్యలుండగా అంత కాలం తను సుఖంగా, నిశ్చింతగా నిద్రపోగలిగినందుకు సిగ్గుపడిన రాజు, తెలిసో తెలియకో తనకు నిద్రాభంగం చేసి కళ్ళు తెరిపించిన వంటవాడికి మంచి బహుమానమిచ్చాడు.

తన కొత్త వంటకం రాజుకు నిద్రాభంగం కలిగించిందని తెలిసి కంగారు పడుతున్న వంటవాడు, బహుమానం వచ్చినందుకు ఆశ్చర్యపడినా అంతకంటే ఎక్కువగా సంతోషాన్నే పొందాడు.





# శనిదోషం

గూటాల గ్రామంలో కృష్ణశాస్త్రి అనే పురోహితుడుండేవాడు. ఆయనకు తెలిసింది పౌరోహిత్యానికి సంబంధించిన మంత్రాలే అయినా, తను జ్యోతిషశాస్త్రంలో గొప్ప పాండిత్యం గలవాడిననీ, భూతభవిష్యద్వర్తమానాలు చెప్ప గలననీ ప్రచారం చేసుకునేవాడు. గ్రామ ప్రజలు ఇది నిజమని నమ్మి, ఆయన్నొక గొప్ప జ్యోతిషపండితుడిగా గౌరవించేవారు.

ఈవిధంగా, ప్రజల అమాయకత్వాన్ని ఆసరా చేసుకుని, ఆయన అప్పుడప్పుడూ గ్రామానికి అపకారం జరగబోతున్నదనీ, పశువులకు అంటువ్యాధులు రానున్నవనీ నమ్మించి, దానికి విరుగుడుగా శాంతి పూజలు, హోమాలు చేయాలని, వారినుంచి భారీగా డబ్బూ, అన్నిరకాల తృణ ధాన్యాలూ వసూలు చేసేవాడు.

ఇలా వుండగా, ఆ గ్రామానికి బడి పంతులుగా రమణమూర్తి అనే యువకుడు వచ్చి, కృష్ణశాస్త్రి ఇంటి పక్కనే వున్న ఒక చిన్న ఇంట్లో నివాసం ఏర్పరచుకున్నాడు. గ్రామస్థులు కృష్ణశాస్త్రి గొప్ప జ్యోతిషపండితుడని చెబుతూంటే విని ముభావంగా వూరుకునేవాడు.

ఒకనాటి సాయంకాలం కృష్ణశాస్త్రి, రమణమూర్తితో మాటల సందర్భంలో, "మాది వంశపారంపర్యంగా పురోహిత కుటుంబం కావడంతో, అలా పౌరోహిత్యం చేసుకుంటూ కాలం గడిపేస్తున్నాను. కానీ, జ్యోతిష శాస్త్రం గురించి నాకు తెలిసినంతగా, ఈ చుట్టుపక్కల ఏడేడు పధ్నాలుగు పరగణాలలో మరెవ్వరికీ తెలియదు. ఇంతెందుకు – మీ ముఖం చూసి, మీ భవిష్యత్తు చెప్పగలను, భయపడకండి! మీకు నెల రోజుల్లో తీవ్రమైన అస్వస్థతా, విపరీతమైన ధన నష్టం జరగ నున్నది. ఇందుకు కారణం మరేం లేదు, శనిదోషం!" అన్నాడు.

డాక్టర్ ఆళ్ళ లక్ష్మీరమణమూర్తి

"అలాగా! మరి నేను శనిదోషాన్నుంచి తప్పించుకునే ఉపాయం లేదా?" అని అడిగాడు రమణమూర్తి నిబ్బరంగా.

"ఎందుకు లేదు? ఇలాంటి అవాంతరాల నుంచి, మనను గట్టెక్కించేందుకే గదా, మన పూర్వులు జ్యోతిశ్శాస్త్రాన్ని రచించింది. మీరు శనికి శాంతి చేయాలి. ఆ శాంతిలో ప్రధానమైనది, నాలాంటి గొప్ప పండితుడికి గోదానం చెయ్యడం," అన్నాడు కృష్ణశాస్త్రి.

రమణమూర్తి కొద్దిసేపు ఆలోచించి, "గోదానం చెయ్యాలంటే కనీసం ఐదు వందల రూపాయలన్నాకావాలి గదా? నాదగ్గర రెండు వందలకు మించి లేదే," అన్నాడు.

ఆ జవాబుకు కృష్ణశాస్త్రి నవ్వి, "ఎంత అమాయకులండీ, ఐదు వందల రూపాయలు మీచేత ఖర్చు పెట్టిస్తానా? అసలే శనిదోషం వల్ల మీరు కష్టాలపాలు కానున్నారు. నాదగ్గర ఒక మంచి ఆవున్నది. దాన్ని రెండు వందల రూపాయలకు మీకు అమ్మేస్తాను. శనివారం మంచిరోజు కాబట్టి, పూజానంతరం దాన్ని నాకు దానం చేసెయ్యండి," అన్నాడు.

ఆ రాత్రి రమణమూర్తి, కృష్ణశాస్త్రికి రెండు వందల రూపాయలిచ్చి, ఆవును తన ఇంటికి తోలుకువచ్చాడు. కృష్ణశాస్త్రి తను రెండు వందల రూపాయలు లాభం పొందినందుకు చాలా సంతోషించాడు.

నాలుగు రోజుల తర్వాత, శనివారం నాడు ఆయన రమణమూర్తి ఇంట్లో పూజా



అదీ చేసి, రమణమూర్తిని దక్షిణ, తాంబూలాలతో గోదానం ఇవ్వమన్నాడు.

ఇందుకు రమణమూర్తి తటపటాయిస్తూ, "చూడండి, శాస్త్రిగారూ! నిజంగా శనిదోషం వల్ల నాకు అస్వస్థతా, ధననష్టం జరుగుతుందంటారా?" అని ప్రశ్నించాడు.

ఇది వింటూనే కృష్ణశాస్త్రి ఉగ్రుడైపోయి, దాపులనున్న ఇళ్ళ అరుగుల మీదివాళ్ళను పిలిచి, "విన్నారా, కొత్తగా మన గ్రామం వచ్చిన పంతులుగారి కుళ్ళంకలు! నేను జ్యోతిషశాస్త్రంలో ఉద్దండుడినని, మీ అందరికీ తెలుసు. ఖర్మ అనాలో లేక జాతక ప్రభావంఅనాలో, ఈయనకు మాత్రం నా పాండిత్యంలో నమ్మకం లేదు!" అని రమణమూర్తి

ముఖంలోకి తేరిపార జూస్తూ, "బుద్ధి కర్మాను సారి కద, అన్నారు పెద్దలు. నేను నొక్కి వక్కాణిస్తున్నాను – మీరు గోదానం చెయ్యకపోతే, ఈ నెల తిరక్కుండానే మిమ్మల్ని శని పట్టి పీడిస్తుంది. నా హెచ్చరిక పాటించండి.చేతులు కాలాక ఆకులు పట్టుకోవడం మూర్ఖపద్ధతి!" అన్నాడు.

రమణమూర్తి ఏమాత్రం తొణక్కుండా, అక్కడ చేరినవాళ్ళకేసి ఒకసారి చూసి, శాస్త్రితో, "ఏమో, శాస్త్రిగారూ! ఈ ఆవుకూ, నాకూ ఏదో పూర్వజన్మ సంబంధం వున్నట్టు తోస్తున్నది. ఈనాటివరకూ ఎక్కడా కనీవినీ ఎరగను, ఇది రోజుకు పది సేర్ల పాలిస్తున్నది. అందువల్ల, ఈ ఆవును మాత్రం దానం చెయ్యను. ఒకవేళ మీరు చెప్పినట్టే, శని ప్రభావం వల్ల నాకు తీవ్ర నష్టం జరిగితే, మీ పాండిత్యాన్ని నమ్మి, నా తప్పును క్షమించ మని కోరుతూ, మీకు రెండు ఆవుల్ని దానం చేస్తాను. ఒకవేళ నెల రోజుల లోపల నాకేమీ నష్టం కలగకపోతే, మీరు చెప్పింది బూటకపు జాతకంగా భావిస్తాను. కనక దయతలచి నెల గడిచాకే గోదానం మాట ఎత్తండి," అన్నాడు.ఇది విని కృష్ణశాస్త్రి నిశ్చేష్టుడయ్యాడు. అక్కడ చేరిన జనం పంతులుగారు చెప్పింది న్యాయంగానే వున్నదన్నారు.

కృష్ణశాస్త్రి తల వంచుకుని ఇంటికి వచ్చి, మంచం మీద రెండు చేతుల్తో తల పట్టుకుని కూర్చుని భార్యతో, "కొత్తగా మన గ్రామం వచ్చిన, ఈ మూర్తిగాడెవడో పచ్చి పాషండు డిలా వున్నాడు. నేను చెప్పిన జాతకం ఎలానూ ఫలించదు. వెయ్యి విలువ చేసే గంగిగోవు లాంటి ఆవును రెండు వందలకే సొంతం చేసుకున్నాడు. పైగా, గ్రామంలో నేను జ్యోతిషశాస్త్రంలో తిరుగులేని పండితుడి నన్న నమ్మకం కూడా పోయే ప్రమాద మున్నది," అన్నాడు.

కృష్ణశాస్త్రి భార్య, భర్తను ఓదార్చుతూ, "గ్రామంలో, పక్క గ్రామాల్లో మీరు పౌరో హిత్యం చేస్తూ గడించే దానితో మనకు సుఖంగానే గడిచిపోతున్నది. అలాంటప్పుడు, ఎందుకు మీకీ జ్యోతిషాలూ, జాతకాల గొడవ!" అన్నది.





# విచిత్ర పుష్పం

## 10

[ఉత్తుంగుడి సాహసాన్ని మెచ్చుకున్న నాగపురి రాజు అతనికి తోడుగా మరికొందరు భటులను పంపుతానని మాట ఇచ్చాడు. నాగపురి రాజకుమారి మల్లిక ఉత్తుంగుణ్ణి పిలిపించి, నాగపురి సింహాసనానికి నాగసింహుడు కుట్ర పన్ను తున్నాడని చెప్పి, దానిని విచ్ఛిన్నం చేయడానికి ఉత్తుంగుడి సహాయం కోరింది. యువరాణి భవనంలోని శతాబ్దిక పుష్పాలు కనిపించకపోవడంతో విస్మయం చెందిన రాజు వాటిని వెతికించమని సేనాధిపతిని కోరాడు. — తరవాత]

రాజభవనం నుంచి వెలుపలికి రాగానే, సేనాధిపతి ఉత్తుంగుడి కోసం కబురు పంపాడు. శతాబ్దిక పుష్పాలను వెతికే బాధ్యతను దళనాయకుడు నాగసింహుడికి అప్పగిద్దామా అన్న ఆలోచన ఆయనకు కలిగింది. కానీ, దళనాయకుడు రాజధానిలో ఉండడం రాజుగారికి ఇష్టం లేదు గనక, ఆ పనిని అతనికి అప్పగించడం మంచిది కాదని నిశ్చయించుకున్నాడు.

శతాబ్దిక పుష్పాలను గురించి ఆలోచిస్తూ సేనాధిపతి తన భవనానికి చేరిన కొంతసేపటికి ఉత్తుంగుడు అక్కడికి వచ్చి, ఆయనకు నమస్కరించి, "మేము ఎప్పుడు బయలుదేరాలి? నా పడవ సముద్ర తీరంలోనే ఉన్నది. మిగతా పడవలు సిద్ధమయ్యాయా? నేను ఇక్కడికి తెచ్చిన పువ్వులు పోను, మిగతావి కాబూయీ ఇంటి దగ్గరే ఉన్నాయి. మేము ఎప్పుడు బయలుదేరుతామో తెలిస్తే, ఆ



తూన్నంతలో దళనాయకుడు నాగసింహుడు అక్కడికి వచ్చాడు.

"నాగసింహా! ఇతడే నేను చెప్పిన యువకుడు ఉత్తుంగుడు. నువ్వు తోడుగా వస్తున్నావని తెలిసి చాలా ఉత్సాహంగా ఉన్నాడు. ఈ యువకుణ్ణి నీ శిబిరానికి తీసుకుని వెళ్ళి, ప్రయాణం గురించిన వివరాలు తెలుసుకో. ఎప్పుడు ఎలా వెళ్ళాలి? ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి? మొదలైన విషయాలను ఇరువురూ చర్చించి నిర్ణయించండి. ఈ యువకుడి ప్రయాణం తప్పకుండా విజయవంతం కావాలని రాజుగారు ఆశిస్తున్నారన్న విషయం మరిచిపోవద్దు. ఇరువురూ మాట్లాడుకుని ఎప్పుడు బయలుదేరాలో తెలియజేయండి," అన్నాడు సేనాధిపతి.

నాగసింహుడు చిన్నగా నవ్వి, "చిత్తం, సేనాధిపతీ! మా సముద్ర ప్రయాణం గురించిన పథకం సిద్ధం చేసుకుని, సాయంకాలానికి మీ దగ్గరికి వస్తాము," అని ఉత్తుంగుడివైపు తిరిగి, "వెళదామా," అంటూ వెనుదిరిగి వెలుపలికి నడవసాగాడు.

ఉత్తుంగుడు అతన్ని అనుసరించాడు. ఇద్దరూ దాపులనే ఉన్న సైనిక శిబిరానికి చేరారు. తన గదిలో ప్రవేశించేంత వరకు నాగసింహుడు ఒక్క మాట కూడా మాట్లాడలేదు. ఉత్తుంగుడు కూడా మౌనంగానే నడిచాడు. నాగసింహుడు తన గదిలో ఉన్న ఒకే ఒక ఆసనంలో కూర్చుని, ఉత్తుంగుణ్ణి

పువ్వులను కూడా తెచ్చుకోవచ్చు," అన్నాడు ఉత్సాహంగా.

"పడవలు సిద్ధమవుతున్నాయి. ఈలోగా నీతో పంపవలసిన భటులను ఎంపిక చేస్తున్నాము. నీకు తోడుగా పంపడానికి దళనాయకుడు నాగసింహుణ్ణి కూడా పిలిపించాము. ఎప్పుడు వెళ్ళాలి? ఎలా వెళ్ళాలి? రాకాసి మృగాన్ని ఎలా ఎదుర్కోవాలి? మొదలైన విషయాలను గురించి నీతో చర్చించడానికి నాగసింహుడు వస్తానన్నాడు," అన్నాడు సేనాధిపతి.

"ఎప్పుడు వస్తానన్నాడు?" అని అడిగాడు ఉత్తుంగుడు.

"ఈపాటికే వచ్చి ఉండాలి. మరి రాని కారణం తెలియదు," అని సేనాధిపతి చెబు

ఎదుట ఉన్న ముక్కాలిపీట మీద కూర్చో మన్నాడు.

ఉత్తుంగుడు కూర్చున్నాక, "రాజుతో సహా అందరూ నీ ప్రయాణం మెచ్చుకుంటూ తెగ మురిసి పోతున్నారు గదా! ఇప్పుడు చెప్పు, నువ్వు చేస్తున్న ఆ సాహస ప్రయాణం ఏమిటో?" అని అడిగాడు నాగసింహుడు హేళనగా.

అతని ధోరణిని చూసి ఉత్తుంగుడు గతుక్కుమన్నాడు. అయినప్పటికీ ఆ క్షణమే తేరుకుని, ఏ మాత్రం తొణక్కుండా తన ప్రయాణం గురించిన వివరాలన్నిటినీ పూస గుచ్చినట్లు వివరించాడు. అంతా విన్న నాగ సింహుడు, "ఇంత దూరం ఒంటరిగా వచ్చిన సాహసవీరుడివి ఇక్కడి నుంచి ఒంటరిగా వెళ్ళలేవా? నీ అచంచలమైన ధైర్యం ఇంతలో ఏమైపోయింది?" అన్నాడు మరింత పరిహా సంగా.

"నేను ఒంటరిగా వెళ్ళడానికే వచ్చాను. అసలు ఇక్కడ మీ రాజ్యం ఉన్న సంగతి కూడా నాకు తెలియదు. అయితే, మీ రాజు కరుణామూర్తి. నామీద కరుణజూపి నాకు తోడు పంపుతానన్నాడు. మరొక్క విషయం ఏమంటే రాకాసిమృగాన్ని ఉపాయంగా మానవ నివాసానికి సాధ్యమయినంత దూరా నికి తీసుకునివెళ్ళి వదిలిపెట్టడం నా ధ్యేయం. అలా చేయడం వల్ల ఒక్క మాణిక్యపురికి మాత్రమే కాదు; మీ నాగపురికి కూడా ఆ



మృగం నుంచి రక్షణ లభిస్తుంది," అన్నాడు ఉత్తుంగుడు.

"నాగపురి రాజ్యం గురించి నీకు విచారం వద్దు. ఒక్క రాకాసిమృగమే కాదు; ఇతర శత్రువులు ఎవరు వచ్చినా సరే మా రాజ్యాన్ని కాపాడుకోవడానికి మేము ఉన్నాం. అందుకు నీ సహాయం అవసరం లేదు. అది సరే, రాకాసిమృగాన్ని చూశానంటున్నావు. అయినా, ఈ కాలంలో రాకాసిమృగాలు ఎక్కడివి? నువ్వు చెప్పే కాకమ్మ కథ నమ్మడానికి వినే వాళ్ళందరూ అమాయకులు కారు!" అన్నాడు నాగసింహుడు పరిహాసంగా నవ్వుతూ.

"మీరు నమ్మినా, నమ్మకపోయినా ఇది ముమ్మాటికీ నిజం! ఆ రాకాసిమృగాన్ని



నేను కళ్ళారా చూశాను. అంతే కాదు; అది మాణిక్యపురి సముద్ర తీరంలో సృష్టించిన బీభత్సాన్ని మా సైనికులు ప్రత్యక్షంగా చూశారు. అది పాదం మోపిన చోటల్లా ఇళ్ళూ, చెట్టు చేమలూ నేలమట్టమైపోయాయి. అందువల్లే దానిని ఎదిరించి పోరాడడం లాభం లేదనీ, వీలయినంత దూరానికి తీసుకునివెళ్ళి వదిలి పెట్టాలని నిర్ణయించారు మా రాజు. శతాబ్దిక పుష్పాల కోసమే ఆ రాకాసిమృగం మాణిక్యపురికి వస్తున్నట్టు కూడా తెలిసింది. అందుకే ఈ పుష్పాల సాయంతో దానిని సుదూర ప్రాంతానికి చేర్చడానికి నేను బయలుదేరాను. ఒకవేళ మీకు రాకాసిమృగం అంటే భయంగా వుంటే మీరు రాకండి. నేను ఒంటరిగానే వెళతాను," అన్నాడు ఉత్తుంగుడు దృఢమైన కంఠస్వరంతో.

"భయమా! నాకా! రాకాసిమృగాన్ని చూసి నేను భయపడతానా? ఛీ ఛీ, భయమంటే ఎరుగని వీరుణ్ణి నేను. పైగా, ప్రాణాలకు తెగించి పోరాడడానికి శిక్షణ పొందిన దళ నాయకుణ్ణి నేను అన్న విషయం మరిచి పోయావా?" అని అడిగాడు నాగసింహుడు.

"మాణిక్యపురిలోనూ శిక్షణ పొందిన సైనికులూ, దళనాయకులూ చాలామంది ఉన్నారు. అయినా, వాళ్ళు రాకాసిమృగం ముందు తమ శక్తిసామర్థ్యాలు ఫలించవని గ్రహించారు. అందుకే మృగం బారి నుంచి తప్పించుకోవడానికి ఈ ఉపాయం ఆలోచించాము," అన్నాడు ఉత్తుంగుడు.

"సరే, ఆ సంగతి అలా వుంచు. నువ్వు తెచ్చిన పుష్పాలు ఇప్పుడు ఎక్కడున్నాయి? నీ గదిలో ఉన్నాయా? అవి మొత్తం ఎన్ని ఉంటాయి? రెండా? మూడా?" అని అడిగాడు నాగసింహుడు.

"చాలానే ఉన్నాయి. పూచిన పువ్వులన్నిటినీ సేకరించి తెచ్చాను. పడవ తల్లకిందులయినప్పుడు కొన్ని సముద్రం పాలయ్యాయి. ఇప్పుడు ఒక కట్ట పువ్వులను రాజుగారికి ఇచ్చాను. మిగిలిన పువ్వులు కోయదొర కాబూయీ దగ్గర ఉన్నాయి. బయలుదేరే ముందు మనం వాటినన్నిటినీ తెచ్చుకోవాలి," అన్నాడు ఉత్తుంగుడు.



"అంటే, ఆ పువ్వులను చూడాలంటే, నేను రాజభవనానికి వెళ్ళాలన్న మాట!" అన్నాడు నాగసింహుడు.

"అవును. కానీ," అంటూ ఏదో చెప్ప బోయి ఆగిపోయాడు ఉత్తుంగుడు.

"కానీ ఏమిటి? ఆ పువ్వులు రాజభవ నంలో లేవా?" అని గద్దించాడు నాగ సింహుడు.

"రాజుగారి దగ్గరి నుంచి ఆ పువ్వులను యువరాణి తీసుకుపోవడం మాత్రమే చూశాను. రాజభవనంలో అవి ఎక్కడ ఉన్నవో నాకు తెలియదు," అన్నాడు ఉత్తుంగుడు.

"ఆ విచారం నీకు వద్దు. ఆ విషయం నేను రాజునే వెళ్ళి అడగగలను. మహారాణి మా అక్కగారన్న విషయం నీకు తెలుసా?" అని అడిగాడు నాగసింహుడు నవ్వుతూ.

"అలాగా! ఆ సంగతి ఇప్పుడే తెలిసింది. చాలా సంతోషం," అన్నాడు ఉత్తుంగుడు ఆ విషయం తనకు అంతకు ముందే తెలుసునన్న విషయం బయటపెట్టకుండా.

"మనం ఎప్పుడు వెళ్ళాలో ఆలోచించి, నీకు తెలియజేస్తాను. ఆ తరవాత ఇద్దరం కలిసి సేనాధిపతి దగ్గిరికి వెళదాం. అంత వరకు నువ్వు నీ విడిదిలోనే ఉండు!" అన్నాడు నాగసింహుడు.

ఉత్తుంగుడు అక్కడినుంచి బయలుదేరి తన విడిదికి వెళ్ళాడు. అక్కడ కూర్చుని ఎవరి నుంచి ఎప్పుడు ఏ కబురు వస్తుందో అని ఎదురుచూడసాగాడు. కానీ మధ్యాన్నం దాటినా ఎవరూ రాలేదు. సాయంకాలమై పొద్దు గూకింది. అయినా, దళనాయకుడి నుంచి గాని, సేనాధిపతి నుంచి గాని, రాజు లేక యువరాణి నుంచి గాని ఎలాంటి సమా చారమూ రాలేదు. అందువల్ల రాజభవనంలో యువరాణి గది నుంచి శతాబ్దిక పుష్పాలు కనిపించకుండా పోయిన సంగతి కూడా అతనికి తెలియదు.

మరునాడు తెల్లవారి, పొద్దెక్కిన కొంత సేపటికి కోయదొర కాబూాయీ ఉత్తుంగుడి విడిదికి హడావుడిగా వచ్చాడు. అతన్ని చూడ గానే, "ఏమయింది కాబూాయీ?" అని అడి గాడు ఉత్తుంగుడు ఆదుర్దాగా.

"నువ్వు తీసుకువచ్చిన శతాబ్దిక పుష్పాలు కనిపించలేదు! నువ్వు వచ్చినప్పుడు తిరిగి ఇవ్వాలనీ, వాటిని జాగ్రత్తగా దాచమనీ నేను నా కుమార్తె చిత్రకు మరీ మరీ చెప్పాను. ఆమె కూడా వాటిని తన స్నేహితురాళ్ళకు కూడా ఇవ్వకుండా తన గదిలోనే భద్రంగా దాచింది. ఈరోజు తెల్లవారి లేచి చూసేసరికి పువ్వులు కనిపించలేదు. ఆమె పువ్వులు దాచిన గదిలోకి రాత్రి ఎవరూ వచ్చినట్టు అలికిడి లేదు. తనను ఆటపట్టించడానికి తన స్నేహితురాళ్ళేమయినా తీసి దాచారేమో అని చిత్ర వెళ్ళి వాళ్ళను అడిగింది. అయినా, వాళ్ళకేమీ తెలియదన్నారు. పువ్వులు ఎలా పోయాయో ఏమాత్రం అంతుబట్టడం లేదు. అంతా మాయగా ఉన్నది. అక్కడికి రాకాసి మృగం వచ్చే అవకాశం లేదు కదా!" అన్నాడు కాబూయీ విచారంగా.

"సముద్ర తీరంలో బండల మధ్య వున్న ఇరుకైన మార్గం గుండా అంత పెద్ద రాకాసి మృగం రాజాలదు. ఒకవేళ వచ్చిందే అనుకున్నా అది అడుగు మోపిన ప్రతిచోటూ సర్వనాశనం అయి వుండేది. కాబట్టి అది రాకాసిమృగం పని కానే కాదు," అన్నాడు ఉత్తుండుగు దృఢంగా.

"మరి ఎవరి పనై ఉంటుందంటావు?" అని అడిగాడు కాబూయీ.

ఉత్తుంగుడు కొంతసేపు మౌనంగా ఆలోచించి, "దళనాయకుడు నాగసింహుడు నిన్ననే రాజధానికి వచ్చాడు. రాజూ, సేనాధిపతీ నాగసింహుణ్ణి నాకు రక్షణగా పంపడానికి



నిశ్చయించారు. మాటల సందర్భంలో నేనే అతనికి శతాబ్దిక పుష్పాలు మీదగ్గర ఉన్నాయని చెప్పాను. పైగా, నాగసింహుడు నాగపురి సింహాసనం కోసం కుట్రపన్నడానికి ఆలోచిస్తున్నట్టు యువరాణి నాకు తెలియజేసింది. అతనిద్వారా రాజుగారికి కూడా ఆపద వాటిల్లే అపాయం ఉన్నది. కాబట్టి నాగసింహుడే మీ ఇంట్లో శతాబ్దిక పుష్పాలను అపహరించి ఉంటాడని నాకు అనిపిస్తున్నది!" అని యువరాణి తనకు చెప్పిన విషయాలన్నిటినీ కాబూయీకి చెప్పాడు.

"నాగసింహుడికి రాజుగారి పట్ల అసూయా ద్వేషాలు ఉన్నాయనీ, అతడు నాగపురి సింహాసనం కోసం కలలు కంటున్నాడనీ నేను ఇంతకు ముందే విన్నాను. అటువంటి దుర్మార్గుణ్ణి నీకు రక్షణగా పంపాలనుకోవడం దురదృష్టకరం. అతని పట్ల నువ్వు చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి సుమా. దళనాయకుడు నీకోసం కబురు చేస్తానన్నాడు గనక నువ్వు ఇక్కడే వుండు. నేను మాత్రం వెళ్ళి రాజుగారికి పువ్వులు కనిపించని సంగతి చెబుతాను," అంటూ కాబూయీ అక్కడి నుంచి రాజు దగ్గరికి వెళ్ళాడు.

కాబూయీ మాటలు విని రాజు, "మీ ఇంట దాచిన శతాబ్దికపుష్పాలు కూడా కనిపించడం లేదా! రాకాసిమృగానికే కాదు, వేరెవరికో కూడా ఆ పువ్వుల అవసరం ఏర్పడిందన్నమాట!" అని కొంతసేపు ఆలోచించి, సేనాధిపతి కోసం కబురంపాడు.

సేనాధిపతి రాగానే, "దుర్జయా! కాబూయీ ఇంటిలోని పుష్పాలు కూడా మాయమయ్యాయట! ఏదో కుట్ర ప్రారంభమయినట్టున్నది!" అన్నాడు రాజు ఆవేశంగా.

"అంతా చిత్రంగా ఉన్నది, ప్రభూ! కుట్రదారులెవరైనాసరే, త్వరలోనే బయటపెడతాను ప్రభూ!" అన్నాడు సేనాధిపతి.

కాబూయీ, ఉత్తుంగుడు తనకు చెప్పిన విషయాలను సేనాధిపతికి చెప్పాడు.

"అదా సంగతి! అంటే శతాబ్దిక పుష్పాలు మీ ఇంట ఉన్న విషయం నాగసింహుడికి తెలుసునన్న మాట!" అన్నాడు సేనాధిపతి తల పంకిస్తూ. — (ఇంకావుంది)





# రాజుగారి మావటీడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, చేపట్టిన కార్యం సాధించి తీరాలనే నీ పట్టుదలా, అకుంఠిత దీక్షా, నాకు విస్మయం కలిగిస్తున్నవి. అయితే, భీతి కొలిపే ఈ శ్మశానంలో ప్రతిసారీ భంగపాటు చెందుతూ ఎంత కాలమని నీ పట్టుదలా, ఓర్పులను నిలుపుకోగలవు? నువ్వు కార్యసాఫల్యం పొందే లోపలే, నిన్ను వార్ధక్యం లోబరుచుకునే ప్రమాదం ఉన్నది. ప్రాణికోటికి — అందునా ముఖ్యంగా మనిషికి వార్ధక్యం శాపం లాంటిది. నువ్వా దశకు చేరాక, ఇప్పుడు నీలో వున్న లోకజ్ఞతా, ఇంగితాలుకూడా మొద్దుబారి పోగలవు. ఆ స్థితిలో నువ్వు, ఉదయపురి రాజు సూర్యసింహుడిలా అనాలోచితమూ, అసంబద్ధమూఅయిన నిర్ణయాలు చేసే అవకాశము

## బేతాళ కథలు



న్నది. ఇందుకు ఉదాహరణగా, ఆ రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఉదయపురిరాజు సూర్యసింహుడు మహా వీరుడు, దయామయుడు. ధర్మపాలనతో ప్రజల హృదయాలలో సుస్థిరస్థానాన్ని సంపాయించుకున్నాడు. అయితే, సంతానం లేని కారణంగా, ఆయన తర్వాత సింహాసనాన్ని అధిష్ఠించే వారసుడు లేడు.

తనకు సంతానం కలగలేదన్న అసంతృప్తితోవుండగానే, సూర్యసింహుడు వృద్ధాప్యం ఒడిలో పడ్డాడు. ఆయన పరిపాలనా బాధ్యత కొంత మంత్రులకు అప్పజెప్పాడు. కాలక్రమాన పరిపాలనలో కొన్ని మార్పులు వచ్చాయి. అవి సూర్యసింహుడి ఎరుకకు రాలేదు. రాజోద్యోగులలో లంచగొండితనం ప్రబలింది. రాజ్యంలో దొంగలూ, దారిదోపిడిగాళ్ళూ విజృంభించసాగారు.

సూర్యసింహుడి కొలువులో, భద్రుడనే మావటీడు వుండేవాడు. వాడి వయసుకూడా ఇంచుమించు రాజు వయసే. వాడు ఎంతో కాలంగా పట్టపుటేనుగుకు మావటి.

ఒకసారి భద్రుడికి జబ్బు చేసింది. అది తెలిసిన సూర్యసింహుడు, వాడికి కొంత ధనం పంపాడు. పక్షం రోజుల తర్వాత భద్రుడు కొంత కోలుకుని, రాజును కలిసి, "మహారాజా! నా మనసులోని మాట తమరు మన్నిస్తానంటే, విన్నవించుకుంటాను," అన్నాడు.

"సరే! సంకోచించకుండా అదేమిటో చెప్పు," అన్నాడు సూర్యసింహుడు.

"మహారాజా! నా కొడుకు భాస్కరుడు గురుకులంలో విద్యనభ్యసించాడు. అయినా వాడికి, తమ ఆస్థానంలో మరేదైనా ఉద్యోగం చేయడంకన్న, నా వృత్తినే చేపట్టాలని ఉన్నది. వాడు ఏనుగులను మచ్చిక చేయడంలో కడునేర్పరి. ఇకముందు పట్టపుటేనుగు మావటీడుగా వాడికి కొలువు ఇప్పించండి," అని వేడుకున్నాడు భద్రుడు.

ఇందుకు సూర్యసింహుడు, "దానికేం భాగ్యం! నీ కొడుకును ఒకసారి గజశాలకు రమ్మని చెప్పు. వాడి నైపుణ్యం ఏ పాటిదో చూడాలి," అన్నాడు.

మర్నాడు భాస్కరుడు గజశాలకు వెళ్ళాడు. అక్కడ కాలమేఘం అనే ఏనుగు వున్నది. అది మహా మొండిఘటం. దాన్ని అదుపు చేయడం చాలా కష్టమైన పనిగా అందరూ భావించేవారు. దానిమీద ఎక్కి రాజప్రాసాదం చుట్టూ తిరగవలసిందిగా, భాస్కరుడికి ఆదేశ మందింది.

భాస్కరుణ్ణి చూస్తూనే, కాలమేఘం గట్టిగా ఘీంకరించింది. భాస్కరుడు ఏమాత్రం భయ పడక ఒడుపుగా దానిమీదికి ఎక్కి, అంకు శంతో దాన్నిఅదుపుచేసి, రాజప్రాసాదం చుట్టూ నడిపించాడు.

ఇది చూసి భాస్కరుడి నైపుణ్యం గుర్తించిన రాజు, వాడికి పట్టపుటేనుగు వజ్రదంతి బాధ్య తను అప్పగించాడు.

ప్రతి సంవత్సరంలాగే, ఆ సంవత్సరం కూడా సూర్యసింహుడి జన్మదిన సందర్భంగా, రాజధానీ నగర వీధులన్నీ అలంకరించారు. ఏనుగు అంబారీలో ఆసీనుడై, నగర వీధుల్లో ఊరేగే తమ రాజును చూసేందుకు నగర ప్రజలు వీధుల్లో బారులు తీరి నిలబడ్డారు.

రాజు పట్టపుటేనుగు మీది అంబారీలో కూర్చోగానే, భాస్కరుడు ఏనుగును నెమ్మదిగా ముందుకు నడిపించాడు. ఆ సమయంలో ఆకాశం మేఘావృతమై ఉన్నది. రాజవీధికి రెండువైపులా నిలబడిన ప్రజలు తమ రాజును చూసి హర్షధ్వానాలు చేయసాగారు.

వీధుల్లో అక్కడక్కడా స్వాగతతోరణాలూ, ద్వారాలూ కట్టబడివున్నవి. పట్టపుటేనుగు వాటికిందుగా వెళుతూ, ఒకచోట పెద్ద స్వాగత





ద్వారాన్ని సమీపించనున్నంతలో హఠాత్తుగా ఆకాశం పెద్దగా ఉరిమి ద్వారం మీద ఫెళ ఫెళారావాలలో పిడుగు పడింది.

ఆ పిడుగుపాటుకు స్వాగతద్వారం కూల నున్నంతలో, భాస్కరుడు పట్టపుటేనుగును అంకుశంతో అదిలించి మెరుపువేగంతో ముందుకు నడిపాడు. ఆ విధంగా రాజుకు పెద్ద ప్రమాదం తప్పింది.

మెల్లగా నడిచే ఏనుగును, తృటికాలంలో మెరుపువేగంతో ముందుకు పరిగెత్తించడ మన్నది, గజవిద్యలో ఎంతో క్లిష్టమైన ప్రక్రియ. అందుకు ఎంతో మనస్థయిర్యం, లాఘవం కావాలి. ఇది రాజు సూర్యసింహుడు గమనిం చాడు.

తిరిగి అంతఃపురం చేరాక రాజు, తనను ప్రమాదం నుంచి రక్షించినందుకు భాస్కరుణ్ణి అభినందించి, "నీ మనసులోని కోరిక చెప్పు, తప్పక తీరుస్తాను," అన్నాడు.

రాజు ఇలా అనగానే భాస్కరుడు ఆలోచ నలో పడ్డాడు. వాడికి ఒకేసారి మూడు ఆలోచ నలు కలిగాయి. మొదటిది : వాడి స్నేహితుడైన జనార్దనుణ్ణి గురించి. జనార్దనుడు, భాస్కరుడి తోపాటు గురుకులంలో విద్యాభ్యాసంచేశాడు. అతడు రాజుగారి కొలువులో ఉద్యోగం కోసం ప్రయత్నించాడు. ఫలితం లేకపోయింది. అత డికి ఉద్యోగం ఇప్పించడం స్నేహధర్మం.

రెండవ ఆలోచన : భాస్కరుడి పొరుగున వుండే వీరదాసు ఇంట్లో దొంగలుపడి వున్న దంతా దోచుకుపోయారు. నగరపాలకుడికి చెప్పుకున్నా దొంగలు దొరకలేదు. పొరుగు వాడికి సాయపడడం మానవతాధర్మం.

మూడవ ఆలోచన: భాస్కరుడి చిన్ననాటి గురువు సుధర్ముడికి జబ్బు చేసింది. వైద్యులు మందులు వాడి, రాజవైద్యుడు తప్ప మరె వ్వరూ ఆయన జబ్బు నయం చెయ్యలేరని తేల్చిచెప్పారు. ఆయనకు రాజవైద్యుడి చేత వైద్యం చేయించడం శిష్యధర్మం.

భాస్కరుడు ఆలోచనలో పడడం గమనిం చిన సూర్యసింహుడు, "భాస్కరా! ఏమిటాలో చిస్తున్నావు? ఏం కోరిక కోరాలనా? నీ మన సులోని ఆలోచన చెప్పు, నేను పరిష్కారం చేస్తాను," అన్నాడు.

భాస్కరుడు తన మనసులో కలిగిన మూడు ఆలోచనల గురించి, రాజుకు చెప్పాడు.

అదివిన్నసూర్యసింహుడు, భాస్కరుడి కోరికలు మూడూ, అతడి స్వలాభానికి కాకపోవడం గమనించి, ఆశ్చర్యపోయాడు. మరొకరైతే ధనం, విలువైన కానుకలు కోరుకుని వుండేవారు.

రాజు తన ఆశ్చర్యాన్ని కప్పిపుచ్చుకుని, "అన్నీ మంచి కోరికలే! నీవే తేల్చిచెబితే, ఒక్క కోరిక తీర్చగలను," అన్నాడు.

భాస్కరుడు ఒక్క క్షణం మౌనంగా వూరుకుని, "ప్రభూ! రాజోద్యోగులలో కొందరు లంచగొండులుగా తయారయ్యారు. వారిని కఠినంగా శిక్షించి, లంచగొండితనాన్ని నిర్మూలించండి!" అని కోరాడు.

ఇదివిని సూర్యసింహుడు పట్టరాని సంతోషంతో లేచి, భాస్కరుణ్ణి కౌగలించుకుని, "నాయనా, భాస్కరా! ఎంతో కాలంగా నన్ను పట్టి పీడిస్తున్న వారసులు లేరన్న దిగులూ, నా తర్వాత రాజ్యం ఏమవుతుందో అన్న చింతా, నువ్వు కోరిన కోరికతో వదిలిపోయినై. నిన్ను త్వరలోనే యువరాజుగా పట్టాభిషిక్తుణ్ణి చేస్తాను. నా తర్వాత ఉదయపురి రాజ్యసింహాసనం నీదే!" అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సూర్యసింహుడు తన పట్టపుటేనుగు మావటికి, ఉదయపురి రాజ్యసింహాసనాన్ని ధారాదత్తం చేయబూనడం, అనాలోచితం, అసంబద్ధం కాదా? భాస్కరుడిఆలోచనలకూ, వాడు కోరిన కోరికకూ ఏ మాత్రం సంబంధం లేదని



తెలుస్తూనే వున్నది కదా? అలాంటి వాణ్ణి తన వారసుడుగా నిర్ణయించడాన్ని బట్టి, రాజు సూర్యసింహుడికి వార్ధక్యభారం వల్ల లోకజ్ఞానం, మేలు-కీడుల తారతమ్యం తెలియకుండా పోయినట్టే గదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల వేయి ముక్కలుగా పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కొందరు వ్యక్తులు మానసికంగా, వయసూ వార్ధక్యాలకు అతీతులుగావుంటారు. ఇలాంటిది అరుదైన విషయం కావచ్చుగాని; ప్రకృతివిరుద్ధం మాత్రం కాదు. రాజు సూర్యసింహుడు వృద్ధుడే కావచ్చు. కాని, భాస్కరుణ్ణి తన వారసుడుగా నిర్ణయించడంలో, ఆయన బుద్ధికుశలత ప్రస్ఫుటమవుతున్నది. ఏవిధంగానంటే — భాస్కరుడి మూడు కోర్కెలలో, తను ఒక్క కోరిక మాత్రమే తీర్చగలనన్నాడు, సూర్యసింహుడు. ఇందుకు భాస్కరుడు కోరిన కోరిక — లంచగొండి రాజోద్యోగులను కఠినంగా శిక్షించమని. వాడు కోరిన ఆ ఒక్క కోరికలోనే, మిగతా కోరికలకు పరిష్కారమార్గం వున్నది. లంచగొండి రాజోద్యోగుల కారణంగానే, వాడి మిత్రుడికి కొలువులో ఉద్యోగం దొరక లేదు. వాళ్ళ కారణంగానే, పోయిన పొరుగింటి వాడి సొమ్ము తిరిగి లభ్యమయ్యే అవకాశం లేకుండా పోయింది. ఇక, తన గురువు అనారోగ్యస్థితిలో వున్నాడని చెప్పిన తర్వాత, రాజు ఎలాగూ ఆయనకు వైద్య సహాయం చేస్తాడు! ఇదంతా గ్రహించిన రాజుకు, భాస్కరుడు గొప్ప ఆలోచనాశక్తి గలవాడని అర్థమైంది. అంతేకాక, వాడు అవకాశం వున్నా, తనకు లాభించే కోరిక కోరలేదు. దీన్ని బట్టి భాస్కరుడికి పొరుగు క్షేమం, రాజ్య భద్రతా తప్ప మరొక ఆలోచన లేదని తేలుతున్నది. ఆ కారణంగానే, సూర్యసింహుడు వాణ్ణి తన వారసుడుగా ఎన్నుకున్నాడు. ఇందులో అనాలోచితం, అసంబద్ధతా అంటూ ఏమీ లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు — (కల్పితం)

[ఆధారం : ఎన్. శివనాగేశ్వరరావు రచన]



# చందమామ కబుర్లు

## కడుపులోకి వెళ్ళిన చిట్టెలుక!

చైనాలో ఎలుకల బెడద ఎక్కువ. వీటిలో చాలా రకాలు కూడా ఉన్నాయి. జియాంగ్సు ప్రాంతంలోని గువాన్ సియాంగ్ గ్రామంలో నివసిస్తున్న హాంగ్ హెూక్సియా అనే స్త్రీకి చిట్టెలుకతో మరొక విచిత్రమైన అనుభవం అయింది. ఆమె రాత్రి ఒళ్ళుమరచి నిద్రపోతూన్నప్పుడు ఒక చిట్టెలుక ఆమె నోట్లోకి జొరబడింది. కేకలు పెడుతూన్న భార్యను చూసి కంగారుపడిన ఆమె భర్త, దీపం తెచ్చి చూస్తే — ఎలుక తోక మాత్రం గొంతులో తగులుకుని ఉన్నది. దానిని బయటకు లాగడానికి ప్రయత్నించాడు గాని, సాధ్యపడలేదు. ఆ తరవాత డాక్టర్ దగ్గరికి వెళితే ఆయన సూదీ, మందులూ ఇచ్చాడు. మూడు రోజుల వరకు ఎలుక ప్రాణంతో కడుపులో తిరుగుతున్నట్టు అనిపించిందట. ఆ తరవాత దాని ఆచూకీ తెలియలేదు!




## నోటినిండా పొగ

అమెరికాలో పొగనిషేధాన్ని ప్రోత్సహిస్తూ యేటా జరుపుకునే ఉత్సవం రోజున 'జిమ్' అనే పెద్ద మనిషి 155 సిగరెట్లు కాల్చి సరికొత్త రికార్డు సృష్టించాడు. ఒకదాని వెనక ఒకటిగా కాకుండా అన్ని సిగరెట్లనూ ఒక్కసారిగా కాల్చి ఈ సంవత్సరం అతడు కొత్త రికార్డు సృష్టించాడు.

## అతి పిన్నవయసు 'పైలట్'!

శాంటియాగోకు చెందిన అగస్టిన్ ఓర్టిజ్ అనే తొమ్మిదేళ్ళ కుర్రాడు — గత అక్టోబర్ నెలలో సింగిల్ ఇంజను విమానాన్ని ఒంటరిగా నడిపి మరొక రికార్డు సృష్టించాడు. ఈనాడు అతడే అతి పిన్నవయసు 'పైలట్'!



## నూరేళ్ళు దాటిన అక్కచెల్లెళ్ళ ఆత్మకథ!

న్యూయార్క్ స్టేట్‌కు చెందిన ఎలిజబెత్ డిలానీ, సారా డిలానీ, అనే నల్లజాతి అక్కాచెల్లెళ్లు రచించిన 'డిలానీ సోదరీమణుల తొలి వంద సంవత్సరాలు' (హేవింగ్ అవర్ సే: డిలానీ సిస్టర్స్ ఫస్ట్ హండ్రెడ్ ఇయర్స్) అనే ఆత్మకథ బాగా అమ్ముడవుతున్నది. విద్యావేత్త అయిన సారా డిలానీ వయసు 104 సం॥లు. దంత వైద్యురాలయిన ఎలిజబెత్ వయసు 102 సం॥లు. ఎంతో ఆరోగ్యంతో ఉన్న ఇద్దరూ మరొక ఇరవై సంవత్సరాలు జీవించగలమని విశ్వసిస్తున్నారు!

# వింతప్రశ్నలు

ఏకాంబరం అనే యువకుడు, చిదంబరం వద్ద కిరాణాకొట్లో పద్దులు రాసే ఉద్యోగం ఖాళీ వుందని తెలిసి వెళ్ళాడు. చిదంబరం, ఏకాంబరాన్ని ఎగాదిగా చూసి, తన కుడిచేతిని ముందుకు చాపి, "ఈ ఐదు·వేళ్ళలో ఏది పెద్దది?" అని అడిగాడు.

"నడిమివేలు!" అన్నాడు ఏకాంబరం వెంటనే. "కాదు! అన్ని వేళ్ళదీ ఒకే వయసు," అన్నాడు చిదంబరం.

తర్వాత చిదంబరం, తన ఎడమచెయ్యి చూపించి, "వీటిలో ఏ వేలు చిన్నది?" అని ప్రశ్నించాడు.

"అన్నిటిదీ ఒకే వయసు!" అన్నాడు ధీమాగా ఏకాంబరం.

"కాదు! చిటికెన వేలు," అన్నాడు విసుగ్గా చిదంబరం.

తర్వాత ఒక క్షణం ఆగి చిదంబరం, "దీనివల్ల నీకర్థమైంది ఏమిటి?" అని ప్రశ్నించాడు.

"ఈ పద్దుల ఉద్యోగం నాకు రాదని!" అన్నాడు ఏకాంబరం.

"బాగా పొరబడ్డావు! ఈ ఉద్యోగం నీకిస్తున్నాను. రేపట్నించే పనిలోకి రా," అన్నాడు చిదంబరం చిరునవ్వుతో.

ఇందుకు ఏకాంబరం తల అడ్డంగా వూపి, "నీలాంటి తలతిక్క మనిషి వద్ద పనిచెయ్యడంకంటే, బిచ్చమెత్తడం మేలు!" అని చరచరా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. — ఆర్. పట్టాభిరామరాజు



# చందమామ అనుబంధం - 63

## మనదేశపు పక్షులు - జంతువులు:

# పికిలిపిట్టలు




రాకేష్‌శర్మ అంతరిక్షం నుంచి భూమిని చూసినప్పుడు ఇతర దేశాలకన్నా భారత దేశం చాలా అందంగా కనిపించింది అని చెప్పాడు. సుప్రసిద్ధ కవి మహమ్మద్ ఇక్బాల్, "సారే జహాఁసె అచ్ఛా హిందూ స్తాన్ హమారా," అంటూ రెండవ చరణంలో, "హం బుల్ బులే హైఁ ఇస్కీ యే గులిస్తాన్ హమారా," (మనం ఆ ఉద్యాన వనంలోని బుల్‌బుల్ పిట్టలం) అన్నాడు. అందే ఉద్యానవనానికి అందాన్నిచ్చేవి బుల్‌బుల్ పిట్టలనే ఈ పికిలిపిట్టలన్న మాట. ఈ పికిలిపిట్టలు మధురంగా అరుస్తూ ఒక చెట్టు నుంచి మరొక చెట్టుకు అందంగా ఎగురుతూ ప్రకృతికి జీవకళను సమకూరుస్తాయి.

మన దేశంలోని పికిలిపిట్టలు పాడవనీ, పర్షియన్ జాతివి మాత్రమే పాడుతాయనీ చెబుతారు. జహంగీర్ చక్రవర్తి భార్య నూర్జహాన్ ఈ పిట్టలను పర్షియా నుంచి తెప్పించింది. ఈ జాతి బుల్‌బుల్ పిట్టలు ఇవాళ కాశ్మీరు ప్రాంత పర్వత సానువులలో ఎక్కువగా ఉన్నాయి. వీటి శరీరం ఊదా రంగుతోనూ, తల నల్లగానూ, బుగ్గలు తెల్లగానూ ఉంటాయి.

తలమీది కుచ్చు, మెడ, తోక నల్లగానూ, మిగతా శరీరం బూడిద - ఊదా రంగుతోనూ ఉండే గుల్దుం బుల్‌బుల్ పిట్టలే ఎక్కువగా కనిపిస్తాయి. తోక మొదట ఎరుపు మచ్చ ఉంటుంది. చివర తెల్లగా ఉంటుంది. ఎర్రముక్కు బుల్‌బుల్ పిట్టలకు, తలమీద నల్లటి కుచ్చు వుంటుంది. వీటి శరీరం పైభాగం ఊదా రంగుతోనూ, అడుగు భాగం తెల్లగానూ ఉంటుంది. రొమ్ము కింద హారం వంటి చార వుంటుంది. ఎర్రముక్కు పికిలిపిట్టలను 'సిపాయిబుల్‌బుల్' అని అంటారు.

జంటలుగా నివసించే పికిలిపిట్టలు తరచూ గొడవపడుతూ ఉంటాయి. అయితే, అవి తమ గూళ్ళను ఎంతో శుభ్రంగా ఉంచుకుంటాయి!






## అమృతా షేర్-గిల్

ఇరవై తొమ్మిదేళ్ళు నిండక ముందే కన్నుమూసినప్పటికీ ఆధునిక భారతీయచిత్ర కళారంగంలో తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకున్న అద్భుతమైన చిత్రకళాకారిణి అమృతా షేర్-గిల్!

రాజా ఉమ్రావ్‌సింగ్ షేర్-గిల్ అనే సంపన్నుడికీ, హంగరీ దేశానికి చెందిన మేరీకీ అమృతా షేర్-గిల్ 1913వ సం॥లో హంగరీ రాజధాని బుడాపెస్ట్‌లో జన్మించింది. ఆమె తండ్రి ఉమ్రావ్ సింగ్ షేర్-గిల్ సంస్కృతం, పర్షియన్ మొదలైన అనేక భాషలను నేర్చిన భాషాకోవిదుడు.

పసిపాపగా ఉన్నప్పుడే అమృత, చిత్రకళ పట్ల ఆసక్తిని కనబరచింది. 1921వ సం॥లో ఆమె తల్లిదండ్రులు భారతదేశానికి వచ్చి, సిమ్లాలో స్థిరపడ్డారు. అక్కడి కొండలూ, చుట్టుపక్కల అందమైన ప్రకృతి దృశ్యాలూ అమృతను ఎంతో ఆకర్షించాయి. ఆమె విద్యాభ్యాసం యూరప్‌లో జరగాలని ఆమె తల్లి ఆశించడంతో, అమృతను ఇటలీలోని ఫ్లారెన్స్‌కు తీసుకువెళ్ళారు. అమృత చిత్రాల పట్ల చూపే ఆసక్తిని చూసి సంతోషించిన ఆమె తల్లిదండ్రులు ఆమెకు చిత్రకళలో శిక్షణ ఇవ్వడానికి, ఆమెను ప్యారీస్ నగరంలోని ఒక ప్రసిద్ధి చెందిన చిత్రకళా పాఠశాలలో చేర్పించారు. అయితే,ఆమె మొదటి నుంచీ భారతీయ చిత్రకళ పట్ల ఎక్కువ ఆసక్తిని కనబరచసాగింది. ఐరోపాలోని చిత్రాల కన్నా, భారతదేశంలోని



ఆమె అనారోగ్యంపాలై 1941వ సం॥లో మరణించింది. వాస్తవికత,కల్పన — ఈరెంటి అద్భుతమైన సమ్మేళనంగా ఆమె చిత్రాలను చెప్పుకుంటారు. ఆమె గీసిన మానవ రూపాలు సజీవ మూర్తులుగా కనిపిస్తాయి. నూతన మార్గాలను అన్వేషించే యువ కళాకారులకు ఆమె చిత్రాలు స్ఫూర్తినిస్తాయి. ❐



అజంతా కుడ్యచిత్రాలు ఆమెకు చాలా గొప్పగా కనిపించి ఆకట్టుకున్నాయి. ఆమె భారతదేశానికి తిరిగివచ్చి, అమృతసర్, సిమ్లా ప్రాంతాలజీవితాలనుచిత్రించడం మొదలుపెట్టింది. అయితే, భారతీయ కళావిమర్శకుల ధోరణి ఆమెకు నచ్చక 1938వ సం॥ లోఐరోపాకు వెళ్ళి, హంగరీకి చెందిన తన బంధువును వివాహమాడింది. ఆ తరవాత పాశ్చాత్య పద్ధతిలో చిత్రాలు గీయడం మొదలు పెట్టింది.1939వ సం॥ లోఆమె మళ్ళీ భారతదేశానికి తిరిగివచ్చి, భారతీయ ఇతివృత్తాలను చిత్రించడం ప్రారంభించింది. కానీ, దురదృష్టవశాత్తు

# మీకు తెలుసా?

1. ఏ రోజును 'ప్రపంచ పర్యావరణ దినం'గా పాటిస్తారు?
2. 'నాగార్జునసాగర్' ఏ నది మీద నిర్మించబడింది?
3. మూడు వందలా యాభై సంవత్సరాలకు పూర్వం టాస్మానియాను, న్యూజీలాండ్‌ను కనుగొన్నవారెవరు?
4. 'ఇంగ్లీష్ ఛానల్'ను మొట్టమొదట ఈదిన భారతీయుడు ఎవరు?
5. 1961 ఏప్రిల్ 12; 1969 జూలై 21 — ఈ తేదీల ప్రాముఖ్యత ఏమిటి?
6. మన పురాణాలలోని కుబేరపురి పేరేమిటి?
7. 'ఫార్మోసా' దేశానికి ఉన్న మరొక పేరేమిటి?
8. రోమన్ చక్రవర్తి దగ్గర ఒక భారతీయుడు వంటవాడిగా ఉండేవాడని చెబుతారు. ఏ చక్రవర్తి దగ్గర? వంటవాడు ఎవరు?
9. 'సుమోకుస్తీలు' ఎక్కడ జరుగుతాయి?
10. 'తమాషా' అనే జానపద నాటకాలు మన దేశంలో ఏ రాష్ట్రానికి చెందినవి?
11. మోటారుకార్లు అత్యధికంగా తయారుచేసే దేశం ఏది?
12. అత్యంత ప్రాచీనమైన భారతీయ వైద్యగ్రంథం ఏది?
13. 'హెూమియోపతి' వైద్య విధానానికి ఆద్యుడు ఎవరు?
14. ప్రపంచంలో రెండవ అందమైన విశాల సముద్రతీరంగా మన దేశంలో దేనిని చెబుతారు?
15. ఆధునిక ఒలింపిక్ క్రీడలు మొట్టమొదట ఎప్పుడు, ఎక్కడ జరిగాయి?
16. ఉత్తర భారతదేశానికి చెందిన 'షెహనాయ్'ని పోలిన దక్షిణాది వాద్యవిశేషం ఏది?

# సమాధానాలు

1. జూన్ 5.
2. కృష్ణానది.
3. ఏబెల్ టాస్మాన్.
4. పశ్చిమ బెంగాల్‌కు చెందిన మిహిర్‌సేన్ (1958).
5. సోవియట్ యూనియన్‌కు చెందిన యూరీ గగారిన్ అంతరిక్షంలోకి వెళ్ళాడు. అమెరికాకు చెందిన నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ మొట్టమొదట చంద్రుడిపై అడుగు పెట్టాడు.
6. అలకాపురి.
7. తాయ్‌వాన్.
8. కాన్‌స్టాంటిన్ చక్రవర్తి (6వ శతాబ్దం); జస్టీనియన్.
9. జపాన్‌లో.
10. మహారాష్ట్ర.
11. అమెరికా.
12. చరకసంహిత.
13. జర్మనీకి చెందిన హానిమన్.
14. మద్రాసు మెరీనా బీచ్.
15. గ్రీసులోని ఏథెన్స్‌లో, 1896.
16. నాదస్వరం.



# రాక్షసుడి కోట

శౌరి అనే యువకుడు అందగాడు, చురుకైన వాడు, సాహసవంతుడు. చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకున్న శౌరిని, వాడి అవ్వ అల్లారుముద్దుగా పెంచి పెద్ద చేసింది. సాహసవంతుడైన శౌరి సైనికుడిగా చేరి, రాజ్య రక్షణ చేయాలని ఉవ్విళ్ళూరేవాడు. అయితే, వాడి అవ్వ అందుకు ససేమిరా ఒప్పుకునేది కాదు.

అవ్వ పోగానే శౌరి తన జీవితకాంక్ష నెర వేర్చుకోవడానికి, రాజధానీ నగరానికి బయలు దేరాడు. దారిలో దట్టమైన అడవిని దాటవలసి వున్నది.

శౌరి అడవిలో ప్రవేశించిన కాస్సేపటికే, "ఆగు! ఎత్తిన కాలు దించకు!" అన్న బొంగురు గొంతు వినిపించింది. పక్కనే వున్న దిబ్బ మీద, ఒక కురూపి నిలబడి వున్నాడు. వాడే శౌరిని ఆగమన్నది. శౌరి ఎత్తిన కాలు ఎత్తి నట్టే వుంచి, ఏదో అనబోతూంటే, కురూపి, "సరిగ్గా నీ పాదం పడేచోట ఒక గండు చీమ వున్నది. అది ప్రాణభయంతో వేసిన పెద్ద కేక, నా మనసును కలచివేసింది," అన్నాడు.

శౌరి వంగి చూడగా, నిజంగానే కురూపి చెప్పిన స్థానంలో గండుచీమ వున్నది.

"ఈ చీమ కేక నీకు వినవచ్చిందా? నమ్మశక్యంగా లేదు!" అన్నాడు శౌరి, చీమ పక్కగా నడిచి దిబ్బ ఎక్కుతూ.

ఇందుకు కురూపి, "నా పేరు ధ్వని! ఎంత చిన్న శబ్దాన్నయినా, నేను వినగలను," అన్నాడు.

శౌరి ఆశ్చర్యపోతూ, "ఇంతటి అరుదైన శక్తిని నీలో వుంచుకుని, అనామకుడిగా ఈ అరణ్యం మధ్యలో వున్నావెందుకు?" అని అడిగాడు.

ధ్వని భారంగా నిట్టూర్చి, "నా ఈ వికార రూపంతో, నలుగురిలో వుండి అవమానాలు

మాచిరాజు కామేశ్వరరావు



సహించే కన్నా, ఇలా ప్రశాంతంగా అరణ్యంలో బ్రతకడం మంచిదనిపించింది," అన్నాడు.

శౌరి ఆప్యాయంగా ధ్వని భుజం తట్టి, "నువ్వు చేయని నేరానికి, నువ్వే శిక్ష విధించుకుంటావా? నేను సైనికుడిగా చేరి దేశసేవ చేయాలని, రాజధానీనగరానికి వెళుతున్నాను. మన దేశానికి నీ సేవలు కూడా ఎంతగానో ఉపయోగపడతాయి. నువ్వు కూడా నాతో పాటు రా!" అన్నాడు.

ధ్వని సరేనని, శౌరి వెంట బయలుదేరాడు. మిట్టమధ్యాహ్నం వేళ వాళ్ళిద్దరూ నీళ్ళ కోసం వెతుకుతూంటే, "ఎండతీవ్రంగావున్నది. కాసేపు విశ్రాంతి తీసుకుని వెళ్ళండి!" అన్న మాటలు, ఒక రాళ్ళగుట్ట మీది నుంచి వినవచ్చాయి.

ఆ మాటలు అన్న వ్యక్తి, ధ్వని కన్నా కురూపి. శౌరి, ధ్వని ఆ కురూపి తెచ్చి ఇచ్చిన మంచినీళ్ళు తాగి దాహం తీర్చుకున్నారు.

"నువ్వు దుస్తుల చాటున నడుముకు బిగించుకున్న డబ్బు మూట ముడి ఒకటి ఊడింది. మరొకటి కూడా ఊడితే, మూట కిందికి జారిపోగలదు, జాగ్రత్త!" అన్నాడు ఆ వికారి.

శౌరి డబ్బు మూటను బయటికి లాగి చూశాడు. ఆశ్చర్యం! వాడు చెప్పినట్టుగా ఒక ముడి ఊడి వున్నది.

"దుస్తుల చాటున వున్న డబ్బు మూట, నీకెలా కనిపించింది?" అని శౌరి వాణ్ణి అడిగాడు.

"నా పేరు దృష్టి! గోడకవతల వున్న వస్తువులు కూడా స్పష్టంగా చూడగలను!" అన్నాడు వికారి.

ఈ జవాబుకు శౌరి చాలా ఆశ్చర్యపడి, "అలాగా! ఇంత అపురూపమైన విద్య దేశానికి ఉపయోగపడకపోవడం అన్యాయం. నువ్వు కూడా మాతోపాటు రాజధానికి బయలు దేరు!" అంటూ దృష్టిని కూడా తమతోపాటు బయలుదేరదీశాడు.

వాళ్ళు ముగ్గురూ కొంచెం ముందుకు వెళ్ళగానే, "ఆగండి! దగ్గరలోనే పులి వస్తున్న సవ్వడి వినవస్తున్నది," అంటూ ధ్వని, శౌరినీ, దృష్టినీ ఆపాడు.

ఇంతలో పులి పొదలచాటు నుంచి గాండ్రుమంటూ వస్తూనే, వాళ్ళమీదికి దూక బోయింది. మరుక్షణం ఒక పెద్ద బండరాయి రివ్వుమంటూ వచ్చి, పులి మీద పడింది. ఆ దెబ్బకు పులి కిందపడి రక్తపు మడుగులో గిలగిలా తన్నుకోసాగింది.

"ఇదేమి వింత!" అనుకుంటూ శౌరి తల ఎత్తి చూశాడు. పక్కనే వున్న బండరాళ్ళ మీద, ఒక కురూపి నిలబడి వున్నాడు. ఆ కురూపే తమ ప్రాణదాతగా గ్రహించి, శౌరి, "చూడబోతే అర్భకుడిలా వున్నావు! అంత పెద్ద బండరాయిని పులి మీదికి ఎలా విసర గలిగావు?" అని అడిగాడు.

కురూపి ఆ ప్రశ్నకు పెద్దగా నవ్వి, "ఎలానా! నా కళ్ళతో! నేను కళ్ళతో శాసిస్తే, ఎంతటి బండరాయి అయినా కదిలి, పడ మన్న చోట పడుతుంది. నా పేరు శక్తి!" అన్నాడు.

"అయితే, నువ్వూ మాతో రాక తప్పదు!" అంటూ శౌరి తన మాటల చాతుర్యంతో శక్తిని కూడా, తమవెంట బయలుదేరదీశాడు.

నలుగురూ చీకటి పడుతున్న సమయంలో, ఒక ఎత్తయిన కొండను సమీపించారు. ఆ కొండ మీద పాతకాలపు కోట ఒకటి వున్నది.

కొండ దిగువున వున్న గుహను చూపిస్తూ, దృష్టి, "ఈ రాత్రికి ఆ గుహలో తలదాచు కుందాం," అన్నాడు.



"గుహలోకి గాలి రాదు. ఈ రాత్రి కొండ మీద కనిపించే కోటలో పడుకుందాం," అన్నాడు శౌరి.

నలుగురూ కొండ ఎక్కారు. కోట గుమ్మా నికి వున్న తలుపు మూసి వున్నది. ద్వారబం ధాన్నుంచి వందలాది గబ్బిలాలు వేళ్ళాడు తున్నవి. శౌరి తలుపు మీద గట్టిగా కొట్ట గానే, గబ్బిలాలు రెక్కల్ని టపటపలాడిస్తూ అన్నివైపులకూ ఎగిరిపోయాయి.

దృష్టికి, కోట తలుపు వెనక వున్నదంతా స్పష్టంగా కనిపిస్తున్నది. ఒక ముసలి రాక్షసుడు వంగిపోయిన నడుముతో భారంగా నడిచి వస్తున్నాడు. వాడు తలుపు పక్కనే వున్న గూటిలోంచి, పెట్టుడు కోరలు, గోళ్ళు తీసి



తగిలించుకున్నాడు. తర్వాత పెట్టుడు కొమ్ముల్ని తలమీద గట్టిగా బిగించుకున్నాడు.

ఇదిచూసిన దృష్టి, మిగతావాళ్ళతో, "ఒక ముసలి రాక్షసుడు పెట్టుడు కోరలతో, కొమ్ములతో తలుపు తెరవబోతున్నాడు. ఏ పెట్టుడివైనా, రాక్షసుడు రాక్షసుడే! పారిపోదామా?" అన్నాడు.

ఇంతలో రాక్షసుడు తలుపుకు దగ్గరగా వచ్చి, "చిట్టిబాబూ, సర్వాంగ సుందరా! నువ్వేనా తలుపు తట్టింది?" అని అనుమానంగా అడిగాడు.

వెంటనే శౌరి, "తలుపు తెరవండి రాక్షసోత్తమా! మీ చిట్టిబాబే మమ్మల్ని పంపించాడు," అన్నాడు.

రాక్షసుడు ఆత్రంగా తలుపు తెరిచి, "మా చిట్టిబాబు ఎక్కడున్నాడు? ఎప్పుడు వస్తున్నాడు? ఇంకా నామీద కోపంగానే వున్నాడా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

శౌరి నీరసం నటిస్తూ, "చీకటితో బయలుదేరి, ఏకబిగిన పది కోసులు నడిచి, చుక్కలనంటే తమ కంచుకోటకు చేరాం. ఆయాసం, మగత, నిద్ర! నీరసంతో నేల కూలుతామేమో అని భయంగా వుంది. ఈ రాత్రికి విశ్రాంతి తీసుకుని, తెల్లవారి మీ చిట్టిబాబు సంగతులన్నీ చెబుతాం!" అన్నాడు.

ఆ జవాబుతో రాక్షసుడు తృప్తిపడి, వాళ్ళు తినడానికి బుట్టెడు పళ్ళిచ్చాడు. తాగడానికి రాగి బిందెడు పాలిచ్చాడు. నలుగురికీ తలుపు పక్కనే వున్న గదిలో పడకలు ఏర్పాటుచేసి, "కళ్ళు మూసుకుని పడుకోండి, పొరపాటున కూడా కోట లోపలికి రావద్దు. ముసలివాణ్ణి గనక – ఇవన్నీ పెట్టుడుగోళ్ళూ, కొమ్ములూ, కోరలూ అని పొరబడేరు, జాగ్రత్త! నిలువునా చీల్చి చెండాడగలను," అని గట్టిగా పళ్ళు కొరకబోయి, అబ్బా అనుకుంటూ దవడ పట్టుకుని లోపలి గదుల్లోకి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత కొద్దిసేపటికే, కోట అదిరిపోయేలా రాక్షసుడి గురక ఆరంభమైంది.

ధ్వని, రాక్షసుడి గురకను కాసేపు విని, ఇంకేదో తెలుసుకున్న వాడిలా చిటికె వేసి, "పేడి భూనభోంతరాళాలు దద్దరిల్లే గురకతో పాటు, కోటలోని చివరి గదిలో ఒక స్త్రీ రోది

స్తున్న శబ్దం కూడా, నాకు వినిపిస్తున్నది!" అన్నాడు.

వెంటనే శౌరి, "అలాగా! నిజమా?" అంటూ బయలుదేరి, అన్ని గదులూ దాటి చివరనున్న గదిని సమీపించాడు.

ఆ గది కిటికీ దగ్గర నిలబడి, బయటి వెన్నెలలోకి చూస్తూ దుఃఖిస్తున్న ఒక అందాల రాణి, శౌరి కంటబడింది. అతడు నిశ్శబ్దంగా ఆమెను సమీపించాడు. ఆమె ధరించిన దుస్తులూ, మెడలోని మణిహారం, ఇతర అలంకరణలూ చూసి, ఆమె తప్పకుండా ఏ రాజకుమారో అయివుంటుందనుకున్నాడు, శౌరి.

ఆమె, శౌరిని చూస్తూనే భయకంపితురాలైంది. శౌరి మృదువుగా, "భయపడకండి! మీరెవరు? నేను మీకు సాయపడడానికి వచ్చాను," అన్నాడు.

ఆ యువతి దుఃఖం నుంచి కోలుకొని ఇలా చెప్పింది:

ఆమె ఆ రాజ్య యువరాణి, పేరు రాయంచ. నాలుగు రోజుల క్రితం ఆమె, తన చెలికత్తెలతో కొండమీది దేవీ ఆలయానికి వెళ్ళినప్పుడు, రాక్షసుడు బలవంతంగా ఆకాశమార్గాన తెచ్చి, కోటలో బంధించాడు. వాడి కుమారుడు సర్వాంగసుందరుడు, రాజకుమారిని తప్ప మరెవరినీ పెళ్ళాడనని పట్టుబట్టి కూర్చున్నాడట! ముసలి రాక్షసుడికి, రాకుమారిని కోడలుగా తెచ్చుకోవడం ఏ మాత్రం ఇష్టం లేదు. తనకు ముప్పొద్దులా కమ్మటి మాంసం కూరలు వండిపెడుతూ,





కష్టం చేయగల రాక్షసిపిల్లనే కోడలుగా తెచ్చుకోవాలని, వాడు ఆరాటపడుతున్నాడు. ఈ విషయంలో తండ్రీ కొడుకుల మధ్య పెద్ద కలహం జరిగింది. సర్వాంగసుందరుడు కోపం కొద్దీ ఎటో వెళ్ళిపోయాడు. ఒక్కగానొక్క కొడుకు దూరం కావడంతో రాక్షసుడు విలవిలలాడిపోయి, రాకుమారిని ఎత్తుకువచ్చాడు. కొడుకు తిరిగి రాగానే ఆమెతో పెళ్ళి జరిపే ఆలోచనలో వున్నాడు.

శౌరి అంతా విని, రాకుమారికి ధైర్యం చెప్పి, "భయపడకండి సూర్యోదయంతో పాటే, మీకీ రాక్షసుడి కోట నుంచి విముక్తి కలిగిస్తాను!" అని ముగ్గురు కురూపుల దగ్గిరకు వచ్చాడు.

తూర్పు తెల్లనవుతూనే, ముసలి రాక్షసుడు మైమరపుకొద్దీ వాడి గోళ్ళూ, కోరలూ, తలమీద కొమ్ములూ లేకుండా ఆదుర్దాగా వాళ్ళ దగ్గరికి వచ్చి, "నా కొడుకు ఎక్కడున్నాడు? మీతో ఏం చెప్పి పంపించాడు?" అని అడిగాడు.

శౌరి, రాక్షసుడికి వంగి నమస్కారం చేసి, "ఆహాఁ, రాక్షసేంద్రా! కొడుకును గురించిన దుఃఖంతో, రాత్రికి రాత్రే మీ వాడి గోళ్ళూ, కొమ్ములూ అదృశ్యమైనట్టున్నది. మీ పితృప్రేమ వేయినోళ్ళ పొగడదగింది!" అన్నాడు.

వెంటనే రాక్షసుడు తల తడివి చూసుకుని, అక్కడ కొమ్ములు లేకపోవడంతో బిక్కచచ్చిపోయి. మరుక్షణం తెప్పరిల్లి కోపంగా, "ఒరే, నిన్నూ, ఈ నేలబారు కొండముచ్చు వెధవల్నీ, నా కొడుకు మిత్రులు గనక ప్రాణాలతో వదులుతున్నాను. నా కొడుకెక్కడ?" అంటూ హుంకరించబోయి పెద్దగా దగ్గసాగాడు.

అప్పుడు శౌరి, వాడితో, "నువ్వు రాకుమారితో పెళ్ళి జరిపిస్తావో లేదో, ఆఖరిసారిగా కనుక్కు రమ్మన్నాడు నీ కొడుకు. అలా కానప్పుడు సముద్రం మధ్యకు పోయి మునిగి చస్తానన్నాడు," అని చెప్పాడు.

అది వింటూనే రాక్షసుడు చెవులు మూసుకుని, "అశుభాలు పలకకు! రాకుమారిని తెచ్చి కోటలో దాచాను. నా కొడుకు సర్వాంగసుందరుణ్ణి వెంటనే బయలుదేరి రమ్మను," అన్నాడు.

"ఆహాఁ, ఈ సంగతి తెలిస్తే, రాత్రే నీ కొడుకు కోటలోకి వచ్చేవాడు. పాపం, అతడికి

కొండ కింది గుహలో రాత్రంతా కటిక రాళ్ళ మీద పడుకునే బాధ తప్పేది!" అన్నాడు శౌరి.

"ఏమిటీ, నా కొడుకు కొండ కింది గుహలో వున్నాడా?" అంటూ ముసలి రాక్షసుడు ఆనందం పట్టలేక పెద్ద కేక పెట్టి, కొండ దిగసాగాడు. వాడివెనకే శౌరీ, ముగ్గురు కురూపులూ కొండ దిగారు. రాక్షసుడు చప్పట్లు చరుస్తూ, గుహలోకి వెళ్ళగానే శౌరి, శక్తికి సంజ్ఞ చేశాడు. వాడు కళ్ళతో ఆదేశించగానే, నాలుగు నిలువెత్తుల బండరాయి లేచి గుహ ద్వారానికి అడ్డుగా పడిపోయింది.

తర్వాత నలుగురూ వెళ్ళి, కోట గదిలో బంధితురాలై వున్న రాకుమారికి రాక్షసుడి పీడ విరగడయిందని చెప్పారు. ఆమె అడిగిన మీదట శౌరి, ఆమెకు తాను ఇంటి నుంచి బయలుదేరిన కారణం, ఆతర్వాత జరిగినదంతా వివరంగా చెప్పాడు.

అంతా విని రాకుమారి ఆశ్చర్యపోతూ, శౌరితో, "ఈ జరిగిందంతా ఒక అద్భుతమైన కథలా వున్నది! ఒక రాజుకు వుండవలసిన తెలివీ, సాహసం, అందం, సమయస్ఫూర్తీ– అన్నీ నీలో వున్నవి!" అన్నది చిన్నగా నవ్వుతూ.

తర్వాత ఐదుగురూ, కొండదిగి కొంత దూరం వచ్చాక, ధ్వని వాళ్ళను ఆగమని, "నాకు ఏనుగొకటి ఇటు వస్తున్న ధ్వని వినిపిస్తున్నది!" అన్నాడు.

ఆ మాట వింటూనే శక్తి, "ఏనుగులంటే నాకు చెడ్డ భయం! ఒరే, దృష్టీ! అదెక్కడున్నదో చెప్పు. ఒక బండరాయిని పంపి, దాని కుంభస్థలం బద్దలుకొడతాను," అన్నాడు.



దృష్టి, ధ్వని చెప్పిన వైపుకు చూసి, "ఆ వచ్చేది పెంపుడు ఏనుగు! దానిమీద వున్న చిన్న అంబారీలో, ఎర్రటి తలపాగాతో, తెల్లటి బుర్ర మీసాలతో ఒకాయన కూర్చుని వున్నాడు. పక్కన గుర్రాల మీద ఈటెలు పట్టుకున్న భటులు, వెనక డప్పులతో దండోరా వేసే మనుషులు!" అన్నాడు.

వెంటనే రాకుమారి, "అయితే, ఆయన మహామంత్రి అభయవర్మ! ఆయనకు ఈ ప్రాంతాలకు రావలసిన అవసరం ఏమిటి?" అంటూ ఆశ్చర్యపోయింది.

అప్పటివరకూ అంతా మౌనంగా చూస్తున్న శౌరి, "రాకుమారీ! ఇక నాకు సెలవిప్పించండి. మీరు, మీ మంత్రిగారిని కలుసుకుని నగరం చేరవచ్చు. నేనూ, నా మిత్రులు బయలుదేరి నగరానికి వెళతాం. అక్కడ నాకు రాజుగారి కొలువులో సైనికుడిగా ఉద్యోగం దొరక్క పోదు. ఆ తర్వాత, మహాశక్తిమంతులైన నా ముగ్గురు మిత్రులూ, రాజధానిలో గౌరవ ప్రదంగా జీవించే ప్రయత్నం చేస్తాను," అన్నాడు.

ఇందుకు రాకుమారి చిరుకోపంగా, శౌరి కేసి చూసి, అప్పుడే చెట్ల చాటు నుంచి బయటికి వస్తున్న ఏనుగుకేసి వడివడిగా నడిచి పోయింది.

పావుగంట కాలం గడిచే లోపల మంత్రి అభయవర్మ, శౌరివాళ్ళున్న చోటుకు వస్తూ, ఏనుగు దిగి, కాలినడకన వచ్చి, శౌరి రెండు చేతులూ పట్టుకుని, "దేశభక్తి కొద్దీ సైనిక వృత్తి స్వీకరించదలిచిన నువ్వు —రాకుమారిని వివాహమాడి, మా మహారాజు తదనంతరం, రాజ్యానికే రాజువు కానున్నావు. మా మహారాజు —రాకుమారిని తెచ్చినవారికి అర్ధ రాజ్యం ఇస్తానని చాటింపు వేయించాడు. రాజ్యంలో అందరికీ ఆ సంగతి తెలిసిందో లేదో అని పర్యవేక్షించేందుకు, నేను స్వయంగా బయలు దేరాను. నువ్వు రాక్షసుణ్ణి గెలవడమే కాక, యువరాణి హృదయాన్ని కూడా గెలుచుకున్నావు. అందువల్ల, భవిష్యత్తులో ఈ రాజ్యానికి నువ్వే రాజువు! పద, అంబారీలో ఆసీనుడివి కా. నీ మిత్రులు గుర్రాలెక్కి మన వెంట రాజధానీ నగరం వస్తారు!" అన్నాడు.






మణిపుర రాజ్యాన్ని ఏలుతున్న మణిధ్వజుడు పరాక్రమవంతుడేకాకుండా, గొప్ప శివభక్తుడు. నూరుసార్లు హోమగుండంలో తన శరీరాన్ని దహింపజేసుకున్నాడు. పదిసార్లు తన తల నరుక్కుని హోమగుండానికి ఆహుతిచ్చాడు. అటువంటి మరెన్నో ఉగ్ర పూజలతో శివుణ్ణి ప్రత్యక్షం చేసుకుంటూ, సారెసారెకూ వరాలు పొందిన వీరశైవుడు మణిధ్వజుడు.

శివుడి త్రిశూలం అతడు కోరినప్పుడు వచ్చి శత్రు సంహారం చేస్తుంది, పాశుపతాస్త్రం కూడా ప్రసాదింపబడింది. తుదకు అతడు కోరినప్పుడు శివుడే వచ్చి అండగా నిలిచి శత్రువులతో యుద్ధం చేసే పెద్ద వరాన్ని కూడా శివుడు మణిధ్వజుడికి ఇచ్చుకున్నాడు. తనకు ఎవరివల్లా అపజయం గానీ, ఎటువంటి ఆపద గానీ రాకుండా ఆ పరమశివుడే తనకు రక్షగా ఉన్నాడని మితిమీరిపోయిన గర్వంతో విర్రవీగిపోయి మణిధ్వజుడు మణిపుర రాజ్యాన్ని ఎంతో నిరంకుశంగా పాలిస్తున్నాడు.

శివుణ్ణిగాక ఇతర దేవుళ్ళనూ, మతాలనూ నమ్మినవారినందరినీ దేశం నుంచి వెళ్ళగొట్టాడు. మిగిలినవారిని నానా విధాలుగా హింసించసాగాడు. రాజ్యంలో శివాలయాలు తప్ప మరే ఆలయమూ లేకుండా ధ్వంసం చేయించాడు.

మణిధ్వజుడి వల్ల అగచాట్లు పడుతున్న వారంతా అయోధ్యకు శరణార్థులుగా పోయి, రాముడితో మొరపెట్టుకున్నారు. మణిధ్వజుడి అహంకారం నశించే కాలం ఆసన్నమైందనీ,

44. అశ్వమేధ సమాప్తి



వారి అగచాట్లు త్వరలోనే తీరుతాయనీ రాముడు వారికి అభయమిచ్చి, అంతవరకు తన రాజ్యంలో సుఖంగా ఉండమని శరణు ఇచ్చాడు. వారందరూ అక్కడే కాలం గడుపుతున్నారు.

స్వైర విహారం చేస్తూ వస్తున్న రాముడి యాగాశ్వం తొలి డెక్క తన రాజ్య సరిహద్దు మీద పడీ పడగానే, మణిధ్వజుడు అమితోత్సాహంతో దాన్ని పట్టి తన రాజధాని మణిపురం అశ్వశాలలో బంధించాడు.

గుర్రాన్ని విడిచిపెట్టి రాముడి పట్ల స్నేహ భావాన్ని చూపవలసిందిగా మణిధ్వజుడికి చెప్పి రమ్మని లక్ష్మణుడు రాచ మర్యాదగా దూతను పంపాడు. మణిధ్వజుడు దూత వీపుమీద కాల్చిన త్రిశూలంతో వాత పెట్టించి, "రావణాది శివభక్తులను చంపిన రాముణ్ణి, శివప్రీతిగా భైరవుడి విగ్రహం ముందు చిత్రవధ చేసి, బలి ఇద్దామని ఉవ్విళ్లూరుతున్నాను! కోటి మంది రాముళ్ళు వచ్చినా నాకు లెక్క లేదు. ఎవరు వచ్చినాసరే త్రిశూలం ముద్రలు వేయించి పంపుతానని, నేను చెప్పినట్లుగా వెళ్ళి లక్ష్మణుడికి చెప్పు!" అని దూత నెత్తి మీద గంపెడు భస్మాన్ని గుమ్మరింపించాడు మితిమించిన అహంకారంతో.

అంతవరకు ఏ రాజ్యంలోగాని ఎటువంటి ఘర్షణా లేకుండా వస్తున్న లక్ష్మణ భరత శత్రుఘ్నులకు మణిధ్వజుడితో యుద్ధం తప్పనిసరి అయింది.

భరతుడు పూరించిన పాంచజన్యం లాంటి శంఖ ధ్వనితో దిక్కులు పిక్కటిల్లుతూండగా, ఒక వంక శత్రుఘ్నుడు సుదర్శన చక్రంలాగ విజృంభిస్తూంటే, తనవంక వెయ్యి పడగలు విప్పి బుసలు కొడుతూన్న శేష సర్పంలాగ ఎత్తివస్తున్న లక్ష్మణుడి ప్రచండ ధాటికి మణిధ్వజుడు తట్టుకోలేక శివుని త్రిశూలాన్ని పిలిచాడు.

అప్పుడు మణిధ్వజుడి పూజామందిరం నుంచి మెరుపులాగా ఉరుముకుంటూ పెద్ద త్రిశూలం లక్ష్మణుడి మీదికి దూసుకుంటూ వెళ్ళింది.

సరిగ్గా అదే సమయానికి అక్కడికి వచ్చిన హనుమంతుడు లక్ష్మణుడికి అడ్డంగా వాలి,

ఏనుగు తొండంతో చెరుకు గడను పట్టుకొన్న ట్లుగా లక్ష్మణుడిని సంహరించడానికి మెరుపు లాగా వస్తున్న శివుడి త్రిశూలాన్ని ఎడమ చేత్తో ఒడిసి పట్టుకొని, గంభీరాకృతితో శివుడి లాగే నిల్చున్నాడు.

మణిధ్వజుడు సంభ్రమంతో శివుడే దిగి వచ్చాడనుకుని చేతులెత్తి జోడించబోతూంటే నవ్వి, హనుమంతుడు, "ఓయి, శివ మహా భక్తుడా! నేను శివుణ్ణి కాదు, ఒక కోతిని, హనుమంతుడిని! రాముడి బంటును? తెలి సిందా?" అంటూ గదను ఎత్తి వాడి మీదికి లంఘించాడు.

మణిధ్వజుడు వేటు తప్పించుకొని దూరంగా పారిపోయి హనుమంతుణ్ణి చూసి తెల్లమొహం వేశాడు.

హనుమంతుడి జటాజూటం గాలిలో ఎగురుతున్నది. కళ్ళు అగ్ని గోళాల్లా భయం కరంగా మెరుస్తున్నాయి. ఒక చేత్తో త్రిశూలాన్ని నేలకు తాటించి పట్టుకొని, అపర మహేశ్వరుడి లాగ నిల్చున్నాడు. తనకు చావు తప్పదనే భయంతో మణిధ్వజుడు ఎలాగో తెగించి శివుడు ప్రసాదించిన పాశుపతాస్త్రం గుర్తు తెచ్చుకొని మంత్రం జపించి, దానిని వింటికి సంధించి విడిచాడు.

పాశుపతాస్త్రం వేడికి ఆ ప్రదేశమంతా ఉడికిపోయింది. లక్ష్మణ భరత శత్రుఘ్నులూ వారి సైన్యమూ అంతా నేలకు ఒరిగి మూర్ఛ పోయారు.

హనుమంతుడు రామనామం జపిస్తూ రొమ్ము విరుచుకుని అస్త్రానికి ఎదురుగా





యుద్ధం చెయ్యి, నీకు అండగా నేను నిల బడతాను!" అని శివలింగం నుంచి మాటలు వినిపించాయి.

తన భక్తుడికి ఇచ్చిన వరం ప్రకారం నందివాహనం ఎక్కి శివుడు యుద్ధరంగంలో అండగా మణిధ్వజుడి ముందు సాక్షాత్క రించాడు.

హనుమంతుడు శివుడితో, "నువ్వు దేవు డివే కావచ్చుగాని, నీకు నేను జంకేది లేదు, కాచుకో!" అంటూ సింహగర్జన చేసి శివుడి మీదకు బయలుదేరాడు.

నంది బెదిరిపోయి శివుణ్ణి క్రిందకు పడ ద్రోసి పారిపోయింది.

శివుడు సర్దుకుని లేచి హనుమంతుడితో, "నా త్రిశూలాన్ని పట్టేశావు, పాశుపతాస్త్రాన్ని నీలో ఐక్యం చేసుకున్నావు. ఇలా చేయడం విష్ణుదేవుడికి ఒక్కడికే సాధ్యం. నువ్వు విష్ణు వువా? విష్ణు భక్తుడివా? ఎవరు నువ్వు?" అన్నాడు.

"మీ దేవుళ్ళతో నాకు నిమిత్తం లేదు. నేను మానవుడైన రాముణ్ణి నమ్ముకొన్నవాడిని. కోతినైన నాకు ఆ మానవుడే దేవుడు. బుద్ధి కూడా కోతిలాగే అతి చంచలమైనది. నా బుద్ధిని ఏకాగ్రతతో ఉత్తమ మానవుడి మీద నిలిపి అంతులేని మనోబలాన్ని, సాహస పరాక్రమాల్ని పొందాను. దీన్ని భక్తి అన్నా, లక్ష్యసాధన అన్నా రెండూ ఒకటే! సమస్త లోకకల్యాణం కోసం నేను నమ్మిన మానవుడు

వెళ్ళాడు. పాశుపతాస్త్రం హనుమంతుడిగుం డెను తాకి చీపురు పుడకలాగ విరిగి హను మంతుడిలో లీనమైంది. హనుమంతుడు మణిధ్వజుడి రథాన్ని తుత్తునియలు చేసి, గదతో కొట్టి, అతణ్ణి చంపడానికి విరుచుకు పడ్డాడు.

మణిధ్వజుడు దెబ్బతిని చావకుండా, పరుగుపరుగున పారిపోయి పూజామంది రంలో శివలింగానికి తల బాదుకుంటూ, "హరహర మహాదేవా! వేగం రా రా!" అంటూ అరిచాడు.

"ఏమిటిది? మణిధ్వజా! కోటి మంది రాముళ్లు వచ్చినా లెక్కలేదన్నావే, ఒక్క రాముడి బంటును ఎదుర్కోలేవా? వెళ్ళు

చేస్తున్న అశ్వమేధయాగాన్ని ఏ దైవభక్తీ, ఎటువంటి శక్తులూ అడ్డుకోలేవు. భక్తులమని చెప్పి దురహంకారులయిన మణిధ్వజుడు వంటివాళ్ళు చేస్తున్నదేమిటి? ఇలాంటి అహంకారులకు, స్వార్థపరులకు అండగా నిలిచే నీలాంటి దేవుళ్ళు లేకపోతేనేం?" అని హనుమంతుడు దిక్కులు దద్దరిల్లేలాగ గద్దించాడు.

ఆ మాటలకు శివుడు నవ్వుకొని, లేని కోపాన్ని తెచ్చిపెట్టుకుంటూ, "సరే ఇప్పుడు నా ఫాలనేత్రాన్ని తెరుస్తున్నాను, కాచుకో!" అన్నాడు.

"త్వరగా తెరు! నీ భక్తుడికి కనువిప్పు కలిగించు!" అన్నాడు హనుమంతుడు.

శివుడు తన మూడోకన్ను తెరవగానే భగ్గున ప్రళయాగ్ని హనుమంతుడి మీదకు దూసుకు వచ్చింది. హనుమంతుడు కుడి చేయి చాచి, అగ్నిని దోసిట్లో పట్టి, ఒకప్పుడు శివుడు హాలాహలాన్ని తాగినట్లుగా, "రామార్పణమస్తు!" అంటూ నోట్లో వేసుకొని గుటుక్కున మింగేశాడు.

శివుడు మణిధ్వజుడిని చూసి, "అంతా చూశావుగా! ఇహ నేను చేయగలిగింది ఏమీ లేదు. హనుమంతుడు ఎవరో కాదు, నా ఆత్మస్వరూపమే! నా అంశతో అవతరించిన అతనిలో, నానుంచి వెలువడిన సర్వశక్తులూ లీనమైనాయి. అతనివల్ల నిజమైన భక్తి అంటే ఏమిటో తెలుసుకో!" అని చెప్పి అంతర్థానమయ్యాడు.



ఈలోగా హనుమంతుడు రివ్వున ద్రోణగిరికి వెళ్ళి సంజీవకరణిని పెళ్లగించి వాయువేగంతో తీసుకొని వచ్చి మూర్ఛపడి వున్న లక్ష్మణ, భరత, శత్రుఘ్నులనూ, సైన్యాన్నీ బ్రతికించాడు.

మణిధ్వజుడికి కనువిప్పు కలిగింది. హనుమంతుడి ముందు మోకరిల్లి అంజలి ఘటించాడు.

హనుమంతుడు అతడితో, "మణిధ్వజా! స్వార్థంతో నీ భక్తి ఎంత క్షుద్రమైపోయిందో గ్రహించావా? స్వప్రయోజనాల్ని కోరి ఈశ్వరుణ్ణి సేవకుడిగా వినియోగించుకోవడం భక్తి కాదు; జీవకోటి సుఖంగా ఉండాలనే ఈశ్వర సంకల్పాన్ని నెరవేర్చడమే నిజమైన ఉత్తమమైన



భక్తి! నీలాంటి వారివల్ల దేవుళ్ళ పరువు పోతున్నది. భక్తులనిపించుకునే స్వార్థపరులనూ, అహంకారులనూ ఏవగించుకొని, మంచివాళ్లు నాస్తికులుగా మారుతున్నారు! ఇప్పుడు నీ అజ్ఞానం తొలగింది గనుక, ఇక నుంచి ద్వేషం, అహంకారం వదలి దైవత్వం అన్నిటిలోనూ ఒకటేనని గుర్తుంచుకొని, ప్రజలందరి సుఖమే పరమావధిగా భావించి ఉత్తమ భక్తుడిగా రాజ్యం పాలించు!" అని చెప్పాడు.

అప్పుడు మణిధ్వజుడు, "ఆంజనేయ స్వామీ! గర్వం మితిమీరి భంగపడితేనే గాని జ్ఞానం రాదు. నా గర్వం మితిమీరడానికే శివుడు నేను కోరిన వరాలన్నీ ఇచ్చాడని ఇప్పుడు అర్థం చేసుకున్నాను. గర్వంతో నేను బంధించిన యాగాశ్వం నాకు మేలే చేసింది. జ్ఞానోదయం కలిగించింది. ఇదంతా రాముడిదయ అనుకుంటాను. నేను స్వయంగా రాముడి దగ్గరకు వెళ్లి క్షమాపణ వేడుకొని, నన్ను తన బంధుకోటిలో చేర్చుకోమని అర్థిస్తాను!" అని చెప్పి తన అశ్వశాలలో బంధించిన యాగాశ్వాన్ని తెచ్చి వినమ్రుడై లక్ష్మణుడికి అప్పగించాడు.

యాగాశ్వాన్ని స్వేచ్ఛగా వదలి అందరూ దానివెంట సంతోషంగా బయలుదేరారు. వారికి మణిధ్వజుడు ఘనంగా వీడ్కోలు ఇచ్చాడు.

మణిధ్వజుడికి శుభ, శోభ అనే ఇద్దరు చక్కని కుమార్తెలున్నారు. వాళ్లు కూడా కవలలుగా పుట్టినవారే. వారిని వెంటబెట్టుకొని మణిధ్వజుడు అయోధ్యకు వెళ్ళి రాముణ్ణి దర్శించి, తన తప్పిదాన్ని మన్నించమని వేడుకున్నాడు.

రాముడు మణిధ్వజుణ్ణి మిత్రుడిగా ఆదరించాడు. తరవాత మణిధ్వజుడు తన కుమార్తెలను లవకుశులకు వధువులుగా అంగీకరించి తనకు రఘువంశంతో బాంధవ్య భాగ్యం కలిగించమని అర్థించాడు. రాముడు అంగీకరించి అశ్వమేధం పూర్తికాగానే పెళ్ళిళ్ళు జరపవచ్చునని అన్నాడు.

మణిధ్వజుడు తాను వెళ్ళగొట్టిన వారినందరినీ సాదరంగా తన రాజ్యానికి తీసుకువెళ్లి,

ప్రజాశ్రేయస్సునే శివపూజగా, ప్రజాసేవనే దైవ భక్తిగా ఎంచి రాజ్య పరిపాలన సాగించాడు.

రాముడి యాగాశ్వం తూర్పు నుంచి దక్షిణ పడమరలను నానా దేశాల్లో తిరిగి, స్వేచ్ఛగా అయోధ్యకు తిరిగి వచ్చింది.

అశ్వమేధ పరిసమాప్తికి కిష్కింధ నుంచి సుగ్రీవాది వానరులు, లంక నుంచి విభీషణుడు, మణిపురం నుంచి మణిధ్వజుడు, అనేకమంది దేశదేశాల రాజులు గొప్ప కానుకలతో వచ్చారు.

లంక నుంచి విభీషణుడు మంచి ముత్యాలను, పగడాలను బండ్లలో తెచ్చాడు. సుగ్రీవుడు వజ్రాలను, బంగారాన్ని తీసుకువచ్చాడు. మణిధ్వజుడు గరుడపచ్చలనూ, కెంపులనూ, చీనాంబరాలనూ తెచ్చాడు.

దేశదేశాల రాజులు తెచ్చిన వెండి బంగారాలతో కోశాగారం నిండిపోయి, ఆరుబయట రాసులుగా పోగుపడ్డవి.

లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు నానా దేశాల్లో ఘనస్వాగతాలు, రాచమర్యాదలు పొంది దిగ్విజయంగా సేనలతో అయోధ్యకు చేరుకున్నారు.

వారి వెనకగా హనుమంతుడు భరద్వాజ, గౌతమ, అత్రి, అగస్త్యాది ఋషులతో వచ్చాడు. రాముడికి అస్త్ర గురువైన విశ్వామిత్రుణ్ణి ప్రత్యేకంగా ఆహ్వానించుకొని వచ్చాడు.

అశ్వమేధయాగం పరిసమాప్తి ఘనంగా జరిగింది. రాముడు ధనధాన్యాలను ఇంటింటికీ పంపించాడు. రాజ్యంలోని పుణ్యస్త్రీలందరికీ రత్నాల నగలనూ, బంగారాన్నీ పంచిపెట్టాడు. ప్రజాహిత కార్యాలు చేసేవారికి అనేక విలువైన బహుమతులను ఇచ్చి సన్మానాలు జరిపించారు.

తరవాత అందరూ మణిపుర రాజ్యానికి మణిధ్వజుడి ఆహ్వానంపై తరలివెళ్లారు. మణిపురంలో కుశుడికి శుభతోనూ, లవుడికి శోభతోనూ వైభవంగా వివాహం జరిగింది. పెళ్ళిసందర్భంలో మణిధ్వజుడు తన రాజ్యాన్నంతనూ లవకుశులకు కానుకగా చదివించి, కొన్నాళ్ళ తర్వాత తపస్సు చేసుకోడానికి అరణ్యానికి వెళ్ళిపోయాడు.





# ప్రతాపుడి అహంకారం

కృష్ణాపురం జమీందారు నరేంద్రుడు మంచి వాడు, నెమ్మదస్థుడు. ఆయన జమీందారీలో వ్యవహారాలు చూడ్డానికి నలుగురు ప్రధానో ద్యోగులున్నారు. ప్రతి ప్రధానోద్యోగి క్రిందా పాతిక మంది చిన్న ఉద్యోగులున్నారు. ప్రధా నోద్యోగులు కొంతమంది చిన్న ఉద్యోగుల చేత స్వంతపనులు మాత్రమే చేయిస్తున్నారనీ, జమీందారీ పనులు చాలావరకు అందువల్ల వెనకబడిపోతున్నాయనీ ఆయనకు తెలిసింది.

నరేంద్రుడు ముందీవిషయం నమ్మలేదు. ఆయన వాళ్ళమీద నిఘా వేసి అది నిజమేనని తెలుసుకున్నాడు. అప్పుడాయన తల్లితో ఈ విషయం చెప్పి, ఆ నలుగుర్నీ పనిలోంచి తీసేస్తానన్నాడు.

నరేంద్రుడి తల్లి అందుకొప్పుకోక, "వాళ్ళు నలుగురూ వయసులో నీకంటే పెద్దవారు. మన కుటుంబానికి నమ్మకస్థులు. వాళ్ళు తప్పు చేసినా మీ నాన్న ఏమీ అనేవాడు కాదు. వాళ్ళ మనసులు నొప్పించకుండా సరైన దారిలో పెట్టగలిగితే సరే! లేకుంటే వూరుకో. ప్రధానోద్యోగులు మనకు నమ్మకంగా వుంటే చాలు. వాళ్ళు పని సరిగా చేయకపోతే ఇబ్బంది పడేది ప్రజలు. ప్రజలగురించి మరీ ఎక్కువ పట్టించుకోవడం మంచిది కాదని, మీ నాన్న అనేవాడు," అని హితబోధ చేసింది.

జమీందారుకిది నచ్చలేదు. కానీ తల్లి మాటను కాదనలేక ఆయన ప్రధానోద్యోగుల జోలికి వెళ్ళ లేదు. ఒకసారి మాత్రం వాళ్ళను పిలిచి, "జమీందారీ వ్యవహారాలు కుంటినడక నడుస్తున్నాయి. మీ క్రింద అందరూ సక్రమంగా పనిచేస్తున్నారు కదా!" అని అడిగాడు.

ఇందుకు వాళ్ళు వినయంగా, "అంతా సక్రమంగాపనిచేస్తున్నారు. కానీ,రోజురోజుకూ జమీందారీ వ్యవహారాలు పెరుగుతున్నాయి. మరికొందరు ఉద్యోగులను నియమించాల్సి వుంది," అన్నారు.

జొన్నలగడ్డ రామలక్ష్మి



ఛత్రపురంలో నరేంద్రుడి బాబాయి వుంటున్నాడు. ఆయన తనకున్న వందెకరాల పొలాన్నీ సమర్థవంతంగా సాగు చేయిస్తూ ఎంతో వైభవంగా జీవిస్తున్నాడు. ఆయన పేరు చతురుడు. పేరుకు తగ్గట్లే తన వద్దకు వచ్చిన వారందర్నీ చతురోక్తులతో నవ్విస్తూం టాడాయన. కొన్నాళ్ళపాటు బాబాయి దగ్గిరకు వెళితే తన మనసుకు ప్రశాంతత చేకూరు తుందని నరేంద్రుడనుకున్నాడు.

చతురుడు, నరేంద్రుడిని ప్రేమాభిమానా లతో ఆదరించి కుశలప్రశ్నలు వేశాడు. జమీం దారు తన ఇబ్బందుల గురించి చెప్పుకుని, "నా సమస్యకు పరిష్కారమున్నట్లు తోచదు. జమీందారీని వదిలి నీ లాగా ఎక్కడైనా వందె కరాలు పొలం తీసుకుని సాగు చేసుకుంటే, ఏ సమస్యలూ లేకుండా సుఖంగా జీవించ వచ్చునేమో!" అన్నాడు.

దీనికి చతురుడు నవ్వి, "వందెకరాల భూమిని సాగుచేయడం సులభమేం కాదు. ఎలాంటి సమస్యనైనా పరిష్కరించి, ఏ వ్యవ హారాన్నయినా చక్కబెట్టగల ప్రతాపుడు, నా కుమారుడు కాబట్టి అది సులభమయింది," అన్నాడు.

ఈ మాటలకు నరేంద్రుడాశ్చర్యపడి, "అయితే ప్రతాపుణ్ణి నాతో పంపించు. నా సమ స్యను పరిష్కరించగలడేమో ప్రయత్నిస్తాను," అన్నాడు.

"ప్రతాపుడు నీ సమస్యను పరిష్కరించ గలడనే నా నమ్మకం. కానీ, నీతో పంపడం నాకిష్టంలేదు. ఎందుకంటే, వాడి అహంకారం ఇంతాఅంతా కాదు. ఈ వందెకరాల పొలాన్నీ చక్కగా సాగుచేయిస్తున్నందుకే, వాడు కన్నూ మిన్నూ కానకుండా వున్నాడు. ఇప్పుడు నీ సమస్యను పరిష్కరించాడంటే, వాడికిక పట్ట పగ్గాలుండవు. ఏమైనా భరించగలను కానీ, అహంకారాన్నిభరించడంనావల్ల కాదు. వాడి లోంచి అది పోగొట్టాలని ఎన్నో ప్రయత్నాలు చేశాను. ఫలించ లేదు," అన్నాడు చతురుడు.

అప్పుడు నరేంద్రుడు నవ్వి, "నీ సమస్య చిన్నది. నా సమస్య పెద్దది. ప్రతాపుడు నా సమస్య తీర్చితే, నేను నీ సమస్య తీర్చగలను," అన్నాడు.

"మొదటిది జరుగుతుంది. రెండోది జరగదనే నా నమ్మకం," అంటూనే చతురుడు, ప్రతాపుణ్ణి నరేంద్రుడితో పంపడానికి అంగీకరించాడు.

తర్వాత ఆయన నరేంద్రుడితో, "నీ సమస్యను తీర్చగలవారు ప్రపంచంలో లేరనీ, ప్రతాపుడి గురించి అందరూ గొప్పగా చెబితే విని వచ్చాననీ చెప్పు. అప్పుడే వాడు నీతో వస్తాడు," అన్నాడు.

కనుచీకటి పడుతూండగా ప్రతాపుడు పొలం నుంచి వచ్చాడు. నరేంద్రుడు అతణ్ణి పలకరించి బాబాయి చెప్పిన విధంగా సాయం కోరాడు.

ప్రతాపుడు ఉబ్బితబ్బిబ్బయి, నరేంద్రుడి సమస్య గురించి మరికొన్ని వివరాలు తెలుసుకుని, "ఈ మాత్రం దానికి, నేను నీతో రావాలా? ఒక ఉపాయం చెబుతాను. అమలుపరిచాక రెండు నెలల్లో పూర్తి ఫలితం కనబడక పోతే నన్నడుగు!" అన్నాడు.

నరేంద్రుడు, ప్రతాపుడు చెప్పిన ఉపాయం విని కృష్ణాపురం చేరుకున్నాడు. ఆయన తన నలుగురు ప్రధానోద్యోగులనూ పిలిచి, "మీరు మా తండ్రిగారి కాలం నుంచీ దివాణంలో పనిచేస్తున్నారు. మిమ్మల్ని నేను మా బంధువుల్లా గౌరవిస్తాను. ప్రస్తుతం జమీందారీ వ్యవహారాలకు డబ్బు సరిపోవడం లేదు. మీరంతా నాకు సహకరిస్తే, మన ఆదాయం పెంచగలను. అందుకు అవసరం అయితే, మీకు మరికొందరు చిన్న ఉద్యోగుల్ని అదనంగా ఇవ్వగలను. అవసరం లేదనుకుంటే ఇప్పుడు





వున్న వారిలో కొందరిని తొలిగిద్దాం," అన్నాడు.

నలుగురు ప్రధానోద్యోగులూ ఎంతో ఉత్సాహంగా జమీందారుకు సహకరిస్తామని మాట ఇస్తూనే, తమకింకా చిన్న ఉద్యోగులు కావాలన్నారు.

ఇందుకు నరేంద్రుడు, "అయితే ఒక పని చెయ్యండి. ప్రతి ఉద్యోగికీ ఏమేం పని ఇస్తున్నారో కాగితం మీద రాయండి. తానేం చేశాడో ప్రతి ఉద్యోగీ కాగితం మీద రాసి మీకివ్వాలి. ఆ విధంగా వాడు చేసిన పని కచ్చితంగా మీకు తెలుస్తుంది. వాడు వారానికి తగ్గ పని చేయలేదంటే, మీరు హెచ్చరించవచ్చు. మీ మంచితనాన్ని చిన్న ఉద్యోగులు దుర్వినియోగం చేయకుండా ఇందువల్ల వీలవుతుంది," అన్నాడు.

నలుగురు ప్రధానోద్యోగులూ ఇందుకూ ఉత్సాహంగా ఒప్పుకున్నారు.

అప్పుడు నరేంద్రుడు, "మరొక్కమాట! మీ మంచితనాన్ని చూసి పనివాళ్ళు లోకువ కట్టవచ్చు. ఉద్యోగులు ఏం పని చేశారో మీకు తెలుస్తూనే వుంటుంది. వాళ్ళు కాగితం మీద రాసిన పని నిజంగా చేసినట్టు, మీరు ధ్రువీకరిస్తూ సంతకాలు పెడుతూండండి. ఆ విధంగా ఉద్యోగులకు మీరంటే భయం వుంటుంది. కాగితం మీద మీ సంతకం లేకపోతే, వాళ్ళు పనిచేసినట్టు కాదు," అన్నాడు.

ప్రధానోద్యోగుల ఉత్సాహంరెట్టింపయింది.

నరేంద్రుడు కొంచెం ఆగి, "మరొక సంగతి! ఎక్కువ పనిచేసిన వారికి ఎక్కువ జీతం. తక్కువ పని చేసిన వారికి తక్కువ జీతం. తుది నిర్ణయం మీదే!" అన్నాడు.

ప్రధానోద్యోగులు జమీందారు తెలివిని విపరీతంగా మెచ్చుకుని, "మీరు ప్రవేశ పెట్టిన ఈ సంస్కరణల వల్ల జమీందారీ ఎంతో వృద్ధి పొందుతుంది," అన్నారు.

"అలా జరగాలనే నా కోరిక! కానీ మీ వంటి మంచివారిని ఎవరైనా మోసగిస్తారు. కొందరు చిన్న ఉద్యోగులు మిమ్మల్ని మొహమాట పెట్టి తప్పుదారిలో నడిపిస్తారు. పని చేయకుండా పనిచేశామని రాసి సంతకాలు పెట్టమంటారు. మీరూ వాళ్ళూ రోజూ ముఖం

ముఖం చూసుకోవాలి కాబట్టి, మీకూ ఇబ్బందిగా వుంటుంది. అందుకే సంతకాలైనాక, ఆ కాగితాలు నాకు పంపిస్తే, నేను కూడా వాళ్ళా పనులు చేస్తున్నారో లేదో పరీక్షిస్తాను. కాగితంలోరాసిన పని జరిగివుండక పోతే, వాళ్ళకు మూడు శిక్షలు. ఒకటి, పనిచేయనందుకు. రెండు, తప్పుడు సమాచార మిచ్చినందుకు. మూడు, మిమ్మల్ని మొహమాట పెట్టినందుకు," అన్నాడు నరేంద్రుడు.

ప్రధానోద్యోగుల ముఖాలు మాడిపోయాయికానీ, వాళ్ళేమీ అనలేక పోయారు. అప్పుడు నరేంద్రుడు మళ్ళీ, "ఉద్యోగులు తిన్నగా వుండక పోతే వాళ్ళను పనిలోంచి తీసేయవచ్చు. ఆ విషయంలోనూ సర్వాధికారాలూ మీవే! అయితే, పని గురించి ఉద్యోగులిచ్చే సమాచారాన్ని బట్టే, వాళ్ళ విషయంలో నిర్ణయాలు తీసుకోవాలి," అన్నాడు.

దీనితో ప్రధానోద్యోగులకు అసలు విషయం అర్థమయింది.

కొత్తవారిని పనిలోకి తీసుకోవాలన్నా, పాతవారిని పనిలోంచి తీసేయాలన్నా, బాగా పనిచేసే వారికి ఎక్కువ జీతం ఇవ్వాలన్నాఅన్నింటికీ పనిని బట్టే లెక్కవుంటుంది. ఆ పనిని లెక్కగట్టడానికి జమీందారు తిరుగులేని పద్ధతి ఎన్నుకున్నాడు. ఇంతకాలం అలాంటి పద్ధతి లేక తమ ఆటలు సాగాయి. ఇకసాగవు!

నెల రోజులు గడిచేసరికి, అప్పటికే పనిలోవున్న వారే ఎప్పుడూ చేయనన్ని ఎక్కువ



పనులు చేశారు. ప్రధానోద్యోగులు తమ స్వంత పనులకు వేరే ఏర్పాటు చేసుకున్నారు. ఎందుకంటే, చిన్న ఉద్యోగులకు ప్రధానోద్యోగుల సిఫారసును బట్టి కాక, పనిని బట్టి ప్రతిఫలం లభిస్తున్నది. అలాంటప్పుడు వాళ్ళు, వారి పనులెందుకు చేస్తారు?

ఇదిగమనించి నరేంద్రుడెంతో సంతోషించి చక్రధరపురం వెళ్ళి చతురుడిని కలుసుకుని, "మన ప్రతాపుడు సామాన్యుడు కాదు. వాడిని నా వద్దకు పంపకూడదా, దివానుగా వుండి నాకు సాయపడతాడు!" అన్నాడు.

చతురుడు నవ్వి, "వాడి మితి మించిన అహంకారం గురించి నీకు ముందే చెప్పాను కదా. ఇప్పుడు వాడు నిన్ను చాలా తక్కువ



చేసి చూస్తాడు. అది నువ్వు భరించలేవు," అన్నాడు.

"నువ్వు చెప్పింది నాకు గుర్తుంది. వాడి అహంకారం తగ్గడానికి ఉపాయమాలోచించాను. శబరివనంలో ప్రద్యుమ్నుడనే యోగి వున్నాడు. ఆయన మహాజ్ఞాని. మన ప్రతాపుడే కాదు, ఈ ప్రపంచంలోని ఏ మేధావీ కూడా ఆయన కాలిగోటికి పోలడు. ఆయన ఎవరితోటీ ఒక్కమాట కూడా మాట్లాడడు. తనవద్దకు ఎవరూ రాకుండా రక్షణ కల్పించమని, ఆయన నన్నుకోరాడు. మన ప్రతాపుడాయనతో వారం రోజులు గడిపాడంటే, వాడి జ్ఞానం పెంపొందుతుంది. అహంకారం నశిస్తుంది," అన్నాడు నరేంద్రుడు.

"సరే! ఆ ప్రద్యుమ్నుణ్ణి కలుసుకునేందుకు ప్రతాపుణ్ణి ఒప్పించే భారం నీది. వాడిలో మార్పు వస్తే, నాకెంతో సంతోషం," అన్నాడు చతురుడు.

రాత్రి ప్రతాపుడు పొలం నుంచి రాగానే, నరేంద్రుడు అతడికి ప్రద్యుమ్నుణ్ణి గురించి చెప్పి, "యోగి అన్నవాడు తన జ్ఞానాన్ని పది మందికీ పంచి పెట్టాలి తప్ప, అహంకరించి ప్రద్యుమ్నుడిలా వుండకూడదు. నేను నీ కాయనను కలుసుకునే అవకాశం ఇస్తున్నాను. నీ వాయన జ్ఞానం పదిమందికీ ఉపయోగపడేలా చేయాలి. అది నీకు తప్ప మరెవరికీ సాధ్యం కాదు!" అన్నాడు.

ఆ మర్నాడు ప్రతాపుడు, ప్రద్యుమ్నుణ్ణి కలుసుకున్నాడు. ఆయనకు హితబోధ చేశాడు. ఆయన అంతా విని, "నాకు చెప్పడానికి నీకేం తెలుసు? నేను చదివిన శాస్త్రాలు ఒక్కొక్కటిగా చెబుతాను. విని, నాకు సలహా ఇచ్చే యోగ్యత నీకున్నదో లేదో తెలుసుకో," అంటూ నాలుగు రోజుల పాటు ప్రతాపుడికి రకరకాల శాస్త్రాలు వివరించాడు.

అన్ని రకాల శాస్త్రాలుంటాయని ప్రతాపుడికి తెలియదు. అతడు ముందు ఆశ్చర్యపోయినా తర్వాత నెమ్మదిగా తేరుకుని, "మీ కెన్ని శాస్త్రాలు తెలిసినా సామన్యుడికి అర్థమయ్యేలా చెప్పడం రాదు. నాకు మీ అంత శాస్త్రజ్ఞానం లేదు. కానీ సామాన్యుడికి పనికొచ్చేలాగా ఎన్నో మేలు చేసే ఉపాయాలు చెప్పగలను,"

అని తను చేసినవన్నీ ఏకరువు పెట్టాడు. అందులో నరేంద్రుడికి చెప్పిన ఉపాయం కూడా వుంది.

ప్రద్యుమ్నుడంతా విని, "నీ ముఖంలో తేజస్సు చూసే నువ్వు గొప్పవాడివని గ్రహించాను. నువ్వు మాట్లాడాక పూర్తిగా నిన్నర్థం చేసుకున్నాను. ప్రపంచానికి కావలసింది నీవంటి వాళ్ళే, నావంటి వాళ్ళు కాదు. నువ్వు ప్రజలకు మధ్య వుండగా నా తెలివి వెల వెలబోతుంది. అందువల్ల, నేనీ ఆశ్రమంలోనే వుంటాను. నువ్వు ప్రజలకు మధ్య వుండి ఎప్పటిలాగే మంచి పనులు చేస్తూండు," అన్నాడు.

ప్రతాపుడు అక్కడి నుంచి తిరిగివచ్చి జరిగింది తండ్రికీ, నరేంద్రుడికీ కూడా చెప్పాడు. ప్రద్యుమ్నుడంతటి వాడి చేత, నీ అంతటి వాడు లేడనిపించుకున్నాక, అతడి అహంకారానికి పట్టపగ్గాలుండవని వాళ్ళిద్దరూ భయపడ్డారు. కానీ, ఆనాటి నుంచి ప్రతాపుడు తనను గురించి గొప్పలు చెప్పుకోవడం మానేశాడు. అడిగిన వారికి మంచి మంచి సలహాలిస్తూనే, ప్రతాపుడంతటి వినయశీలుడు లేడని పేరు తెచ్చుకున్నాడు.

ప్రతాపుడి తండ్రి ఒక్కడే కొడుకులోని మార్పుకు కారణం గ్రహించాడు. అదేమిటంటే — ప్రద్యుమ్నుడు మహాజ్ఞాని అనడంలో సందేహం లేదు. అంతటి జ్ఞానీ ప్రతాపుడిని పొగిడి తను ప్రజలమధ్యకు రాకుండా తప్పించుకున్నాడు. ప్రజలకు సలహాలిచ్చి పేరు తెచ్చుకోవాలన్న తాపత్రయం జ్ఞానులకుండదు. ఆ విషయం ప్రతాపుడికర్థమై తను జ్ఞాని కాదని గ్రహించాడు. అనుకున్నది సాధించడం ప్రతాపుడి అలవాటు. ప్రద్యుమ్నుడిని ప్రజల మధ్యకుతేగలనని అతడనుకున్నాడు. కానీ, అది సాధ్యపడలేదు. తనకంటే తెలివైన వారిదగ్గర తన తెలివి రాణించదని అప్పటికి అతడికర్థమైంది. ప్రద్యుమ్నుడు అతడికి లేని తెలివిని పొగిడి, ఆ వినయంతోనే అతడిని ఓడించాడు. ఎదుటి వాడిని అవినయంతో కాక, వినయంతోనే ఓడించి లొంగదీసుకోవచ్చునన్న కొత్త విషయాన్ని ప్రతాపుడు తెలుసుకున్నాడు. అది తెలిశాక అతడిక అహంకారిగా వుండలేదు!





# పావనం

పూర్వం ఒక భక్తుడు ఉండేవాడు. అతనికి యాత్రలు చేయాలని అభిలాష మిక్కుటంగా ఉండేది. అయితే, ఇల్లు కదలటానికి ఎంత మాత్రమూ వీలులేకపోయింది. వృద్ధులైన తల్లి దండ్రులు అతని మీదనే ఆధారపడివున్నారు. కనుక, క్షణం సేపైనా వాళ్ళను విడిచిపోవా లంటే సాధ్యమయ్యే పనిగా కనిపించలేదు.

ఈస్థితి భక్తుడి మనస్సుకు చాలా కష్టం కలిగించింది. "ఈ ముసలివాళ్ళను వదిలి నేను యాత్రలు చేసుకునేదేమిటి? నాకిక మోక్షం కలిగేదేమిటి?" అని నిరాశ చెంది అతను విచారించసాగాడు.

యాత్రలమీద దీక్ష పట్టిన ఆ భక్తుడికి ఒక్కొక్కసారి, "ఈ ముసలివాళ్ళను వదిలేసి పోదామా?" అనిపించేది. ఇలా వుండగా, అత నికి ఒక మంచి అవకాశం దొరికింది. అతని బంధువు ఒకాయన, "నాయనా, నువ్వుపోయి యాత్రలుచేసుకురా. నువ్వు తిరిగి వచ్చేదాకా నీతల్లిదండ్రులనునేను కనిపెట్టుకువుంటాను," అన్నాడు.

భక్తుడు వెంటనే యాత్రలకు బయలు దేరాడు.

అతను పోయిపోయి కొన్నాళ్ళకు ఒక అరణ్యమార్గం ప్రవేశించాడు. ఆ అరణ్యంలో కుక్కుటముని అనే ఒక మహానుభావుడు ఉన్నట్టూ, ఆయన దర్శనం చేసి ఎంతోమంది తరించుతున్నట్టూ అతడు విన్నాడు.

తీరా ఆశ్రమానికి వెళ్ళి చూస్తే, భక్తుడు తలిచినట్టు ఆ కుక్కుటముని తపస్సు చేసు కోవటం లేదు, ఏమీ లేదు. సామాన్య గృహస్థు లాగానే సంసార తాపత్రయంలో మునిగి ఉన్నాడు. భక్తుడు ఆశ్చర్యంతో ఆయన చర్య లన్నిటినీ గమనిస్తూ కూర్చున్నాడు.

ఆ ముని వంటచేశాడు. అక్కడ వుండే ముసలి దంపతులకు వడ్డించాడు. వాళ్ళ సదుపాయాలన్నీ చూశాడు. ఇదంతా పూర్తి

అయిన తరవాత ఇవతలకు వచ్చి, తనకోసం కూర్చునివున్న భక్తుణ్ణి చూసి, "నాయనా, ఏంపనిమీద వచ్చావు?" అని అడిగాడు.

అందుకు భక్తుడు, "మహాత్మా! నేను యాత్రలకోసం బయలుదేరి, తమ పేరు విని దర్శనం చేసుకుపోదామని వచ్చాను. త్రివేణీసంగమం ఇక్కడికి సమీపంలోనే వున్నదంటారే. కొంచెం దారి చెబుతారా?" అన్నాడు వినయంగా.

ఈ మాటకు ముని, "నాయనా! వృద్ధులైన నా తల్లిదండ్రులను సేవించుకోవాలి. వారిని విడిచి ఎక్కడకూ వెళ్ళలేను. అందుచేత, త్రివేణికిదారినాకు తెలియదు," అని బదులు చెప్పి, లోపలికి వెళ్ళిపోయాడు.

తనకు తరుణోపాయం చూపిస్తాడని అనుకున్న ఆ మునికి, దగ్గరనే వున్న త్రివేణి ఎక్కడ వున్నదో తెలియదనటంతో భక్తుడికి ఆయనమీద వుండిన గౌరవం కాస్తా పోయింది. "ఈ మునిని గురించి చెప్పుకునే గొప్ప ఏమిటో బోధపడటంలేదే!" అనుకుని ఆలోచిస్తూ అక్కడే నిలబడ్డాడు.

అంతలో, ముగ్గురు స్త్రీలు వచ్చి ఆశ్రమంలోకి ప్రవేశించారు. వాళ్ళ ముగ్గురి రూపాలూ, చూడటానికి రోతగా కనిపించినై. వాళ్ళు రావటంతో భక్తునికి జిజ్ఞాస మరీ ఎక్కువై అక్కడనే వేచి ఉన్నాడు.

మరి కొంచెం సేపటికల్లా ముగ్గురూ అప్సరసల్లాంటి రూపాలతో ఆశ్రమం లోపలినుంచి ఇవతలకు వచ్చారు. భక్తుడిఆశ్చర్యానికి మేర లేకపోయింది. ఆ అపురూప సౌందర్యవతుల కేసి తిరిగి "అమ్మా! మీరెవరు? మీకిక్కడ



ఏమి పని?" అని ఆత్రంతో ప్రశ్నించాడు భక్తుడు.

అప్పుడా సుందరీమణులు ఇలా చెప్పారు: "నాయనా! మేం ముగ్గురమూ అక్కాచెల్లెళ్లం, ఈ లోకంలో మమ్మల్ని గంగ, యమున, సరస్వతి అని పిలుస్తారు. ప్రయాగ వద్ద మేం ముగ్గురమూ కలిసి నదుల రూపంలో ప్రవహిస్తూ వుంటాము. పాపాలు పోగొట్టుకోవాలనే తాపత్రయంతో దేశదేశాలనుంచి జనం వచ్చి మాలో స్నానం చేస్తారు. కన్న తల్లిదండ్రులను ఉపేక్ష చేసే వాళ్ళూ, మరి అనేక మహాపాతకాలు చేసిన వాళ్ళూ వచ్చి మునగటంతో వాళ్ళ పాపాలు సోకి మాకు అసహ్యకరమైన రూపాలు వస్తుంటై. అలాంటి స్థితిలో వుండిన మేమే నువ్వు మొదట చూసిన వికార స్వరూపులం."

"అలాగా!" అని ఆశ్చర్యపడ్డాడు భక్తుడు.

"ఆ వికార స్వరూపాలు పొందిన మేము, అప్పుడప్పుడు ఈ ఆశ్రమానికి వచ్చి, ఈ మహానుభావుడి దర్శనం చేసుకోవటంతో మా పాపాలన్నీ తొలగిపోయి, మేము నిజస్వరూపాలతో మళ్ళీ ఇవతలకి వస్తూవుంటాము. మాకు చుట్టుకున్న పాపాలు మిక్కుటమైనప్పుడల్లా మేమీ పరమ పావనుడయిన మహాత్ముడి దర్శనానికి వస్తూంటాము," అంటూ ముగ్గురూ అదృశ్యమయ్యారు.

వారి మాటలతో భక్తుడి మనసులో గొప్ప మార్పు వచ్చింది. చిరకాలం నుంచి అతనిలో ఉంటూ వున్న యాత్రాభిలాష వెంటనే సమసిపోయింది. మరొక్క అడుగుకూడా ముందుకు వేయకుండా, అతను ఇంటికి మరలి పోయాడు. ఆ నాటి నుంచీ అతను తల్లిదండ్రులనే ప్రత్యక్ష దైవాలుగా భావించి, వారిని భక్తితో సేవించుకోసాగాడు.

శ్రమపడి సేవించుకుందామనుకొన్న ఆ గంగా, యమునా, సరస్వతులు ఆ విధంగా తన కళ్ళ ఎదటనే తాండవించటం మహాభాగ్యమనుకొన్నాడు.

తల్లిదండ్రులకు సేవలు చేస్తూ, ఆనాడు కనబడిన పుణ్య నదులయిన ఆ ముగ్గురు అక్కాచెల్లెళ్లనూ స్మరిస్తూ, ఆ భక్తుడు చిరకాలం హాయిగా జీవించాడు.



# ప్రకృతి వింతలు

## నీళ్ళులేకుండా బతికే జంతువులు!



ఒంటెలను ఎడారి ఓడలు అంటారు. అంటే ఓడలు నీళ్ళ మీద ప్రయాణం చేస్తే, ఒంటెలు రోజుల తరబడి నీళ్ళు తాగకుండా ఎడారిలో ప్రయాణం చేయగలవు. ఒంటెల ఎత్తయిన వంగిన వీపులో కొవ్వు పదార్థాలు ఎక్కువగా పేరుకుని ఉంటాయి. ఆ కొవ్వు పదార్థాలు శరీరానికి కావలసిన శక్తిని ఇస్తాయి. ఒంటెలకు అంతగా చెమట పట్టదు. కాబట్టి శరీరంలోని నీళ్ళు అలాగే నిలవ వుంటాయి. అయితే, ఇవి నీటి చెలమను చేరగానే, ఒక్కసారిగా 25 గ్యాలన్ల నీళ్ళు తాగేస్తాయి. ఇవి సాధారణంగా ఎండుగడ్డినీ, నాగజెముళ్ళనూ తింటాయి.

## ఈకలను దువ్వుకునే పక్షులు!

పక్షుల శరీరం నుంచి తీసిన ఈకను నీళ్ళలో తడిపినట్టయితే రోమాలు రాలిపోతాయి. అయితే పక్షి రెక్క మీద ఉన్నప్పుడు ఈకలు తడిసినా రోమాలు రాలిపోవు. దీనికి కారణం పక్షుల శరీరం మీద వున్న నూనె గ్రంథులు. దాదాపు పక్షులన్నిటికీ తోక చివర నూనె గ్రంథి వుంటుంది. పక్షి ముక్కుతో దువ్వుకున్నప్పుడు ఈ గ్రంథి నుంచి ఒకవిధమైన నూనె స్రవించి ఈకలకు సరఫరా అవుతుంది. గ్రంథుల నుంచి స్రవించే నూనె ఈకలను పట్టి ఉంచడమే కాకుండా పక్షులు వర్షంలో ఎగిరేప్పుడు ఈకలు తడిసిపోకుండా నీటి బిందువులు జారిపోయేలా చేస్తుంది. అందువల్లనే పక్షులు తరచూ ముక్కుతో ఈకలను దువ్వుకుంటూ ఉంటాయి. పక్షులు అలా దువ్వుకునేప్పుడు వాటి నోటిలోకి కొంత నూనె పదార్థం వెళుతుంది. అది డి.విటమిన్ శక్తిని కలిగిస్తుంది.



## దీర్ఘాయువులు!

మొరీషియస్ అనే తాబేలు 152 సం॥లు జీవించింది. దానికి 200 సం॥లు కూడా వుంటుందని, దానిని చూసినవాళ్ళు చెబుతున్నారు. ఇప్పుడు అమెరికాలో ప్రాణాలతో వున్న కరోలినా అనే తాబేలు వయసు 123 సం॥లు. సన్తన జంతువులలో ఏనుగులు ఎక్కువ కాలం, అంటే 60-70 సం॥లు జీవిస్తాయి. నీటిఏనుగు, ఖడ్గమృగం 40 సం॥లు; ఎలుగుబంటి 30-32 సం॥లు జీవిస్తాయి. కొన్ని గుర్రాలు 50 సం॥లు జీవిస్తాయి. కుక్క ఆయుస్సు 22 సం॥లు. కొన్ని గరుడపక్షులు, చిలుకలు యాభై ఏళ్ళు జీవిస్తాయి. చేపలలో వాలుగ చేప 60 సం॥లు, అమెరికన్ ఈల్ 50 సం॥ల కాలం జీవిస్తాయట!



